

# చందమామ

## 61వ సం.లో అడుగు పెడుతూ
## పాఠకులను అలరించనున్న వినూత్న పథకాలు!

### డిజిటల్ రంగ ప్రవేశం:



ఆసక్తికరమైన ఇంటరాక్టివ్ పేజెస్‌తో వెబ్‌సైట్. ఇందులో మీ
సృజనాత్మక సామర్థ్యాలను ప్రదర్శించడానికి మీరూ పాల్గొనవచ్చు.

కంప్యూటర్ ప్రియులకు ఈ-మేగజైన్

### ప్రత్యేక సంచికలు:

ప్రత్యేక సందర్భాలను పురస్కరించుకుని మరిన్ని
శీర్షికలతో, ఎక్కువ పేజీలతో ప్రత్యేక సంచికలు.

### కథల సంకలనాలు:

జానపద కథలు
బేతాళ కథలు
సీరియల్ కథలు
కామిక్స్ రూపంలో సుప్రసిద్ధ కథలు

### సిడిలు-డివిడిలు:



పాతసంచికల నుంచి ఉత్తమమైన కథలు,
వింతలు విశేషాలు.

వజ్రోత్సవ సందర్భంగా ప్రారంభించనున్న
ఈ పథకాలు మరింత జయప్రదం కావడానికి పాఠకుల సూచనలను,
సలహాలను ఆహ్వానిస్తున్నాం.

ఈ చిరునామాకు రాయండి :




**చందమామ ఇండియా లిమిటెడ్**

82, డిఫెన్స్ ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్,
చెన్నయ్-600 097 e-mail:chandamama@vsnl.com



డా॥ వై.యస్. రాజశేఖర రెడ్డి



ముఖ్యమంత్రి
ఆంధ్రప్రదేశ్



హైదరాబాదు

28.5.2007

## సందేశం

"చందమామ" పత్రిక బాల ప్రపంచాన్ని అలరించడంలో 60 ఏళ్లు ఫలవంతంగా పూర్తిచేసుకుని 2007 జూన్‌లో ప్రత్యేక సంచికను వెలువరిస్తున్నదని తెలిసి నాకెంతో ఆనందం కలిగింది.

బాల సాహిత్యం అరుదుగా వస్తున్న సమయంలో ఆ కొరతను తీరుస్తూ నెలనెలా సరికొత్త జానపద కథలతో, రంగుల బొమ్మలతో 13 భాషల్లో బాల బాలికలకు వినోదాన్ని, మనోవికాసాన్ని కలిగించే "చందమామ" తన పేరును సార్థకం చేసుకుంది.

నాకు చిన్నప్పటినుంచి "చందమామ" అంటే వల్లమాలిన ఇష్టం. పిల్లలందరికీ ఈ పత్రిక అంటే ప్రత్యేక అభిమానం వుంటుందని నా నిశ్చితాభిప్రాయం. ముఖ్యంగా విక్రమార్కుడి సాహసాన్ని, వివేకాన్ని ఆకర్షణీయంగా వర్ణించి, పిల్లల మేధస్సుకు పదును పెట్టే బేతాళ కథలంటే నాకు బాల్యంలో చాలా ఆసక్తి వుండేది.

సత్యం, ధర్మం, నీతి, నిజాయితీ వంటి సామాజిక విలువలకు అద్దం పట్టే కథలను ప్రచురిస్తూ, బాల బాలికల మనస్సుపై చెరగని ముద్ర వేయడంలో "చందమామ" కృతకృత్యమైందనడంలో ఎలాంటి సందేహం లేదు.

చిన్న పిల్లలతో బాటుగా, అన్ని వయస్సులవారికీ ఆనందాన్ని కలిగించే చందమామ మరెన్నో తరాల వారిని అలరించగలదని మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను.

(వై.యస్.రాజశేఖర రెడ్డి)

బి. విశ్వనాథరెడ్డి
ఎడిటర్

వజ్రోత్సవ సందర్భంగా శుభాకాంక్షలు పంపిన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి గారికి హృదయపూర్వక కృతజ్ఞతలు. -సం.





చందమామ సంపుటి: 60 జూలై 2007 సంచిక:7

## ఈ నెల విశేషాలు



సంజీవనీ మంత్రం (బే.క) ...19



నీలంరంగు పువ్వుల అడవి ...31



ఆ రోజు జ్ఞాపకాలు ...40



రామాయణం (అరణ్యకాండ-4) ...57

## ఈ సంచికలో ...


* అన్న-తమ్ముడు ...07
* పనితనం ...12
* రాకాసిలోయ - 23 ...13
* భారత దర్శిని ...25
* పర్వతరాజు-పర్వతరాణి ...26
* చందమామ కబుర్లు ...30
* స్వర్గానికి అడ్డుదారి లేదు! ...36
* నాకు నచ్చిన కథ-1 ...38
* అరవైయేళ్ళ చందమామ ...43
* చందమామ ఇండియా క్విజ్ - 6 ...36
* నిత్యసంతోషి ...47
* ప్రాపకం ...50
* వింత హెచ్చరిక ...54
* అనుకున్నదొకటి! ...63
* అజేయుడు గరుడుడు! - 18 ...67
* మన వారసత్వ భవనాలు - 1...71
* వార్తలలో బాలలు ...72
* విజ్ఞానం ... వినోదం ... వికాసం ... ...73
* ఫోటో వ్యాఖ్యల పోటీ ...74




వ్యవస్థాపకులు
బి. నాగిరెడ్డి - చక్రపాణి

చందమామ అరవైయేళ్ళు పూర్తిచేసుకుని ఈ సంచికతో అరవై ఒకటవ సంవత్సరంలో అడుగుపెడుతూన్న శుభ సందర్భంలో మనసులో రకరకాల ఆలోచనలు! వాటిని పాఠకులతో పంచుకుంటున్నాం! ఈ విజయాన్ని వ్యవస్థాపకులకు, పాఠకులకు అంకితమిస్తున్నాం.







# వజ్రోత్సవం - విజయపథంలో ఆశయదీపం!

అరవైయేళ్ళకు పూర్వం మన దేశమే కాదు; ప్రపంచం కూడా చాలా భిన్నంగా ఉండేది. 1947వరకు ఎక్కడినుంచో వచ్చిన కొందరు విదేశీయులు సువిశాలమైన మన ఉపఖండాన్ని పాలించారని ఇప్పుడు ఊహించగలమా? 1947లో మనం స్వాతంత్ర్యం సాధించాం. అయితే, అదే సమయంలో దురదృష్టవశాత్తు మతకలహాలు చెలరేగి దేశవిభజన కూడా జరిగిపోయింది. ప్రజల మనసులను ఒక విధమైన అనుమానం, నిర్వేదం ఆవరించాయి. ఆ సమయంలో భావిపౌరులైన పిల్లలనైనా చిరునవ్వులు చిందించేలా చేయాలని ఇద్దరు మిత్రులు ఆలోచించారు. దేశంలోని బాలబాలికలందరూ తమ తమ మాతృభాషలలో ఆహ్లాదకరమైన కథలు చదివి ఆనందించాలన్న ఉద్దేశంతో చందమామను ప్రారంభించారు.

ఆ కాలఘట్టంలో మరీ తక్కువ పత్రికలు ఉండేవి. రేడియో సైతం పట్టణాలకే పరిమిత మైన విలాస పరికరంగా ఉండేది. ఇక టీవీ, కంప్యూటర్, ఇంటర్నెట్ లాంటివి అభూతకల్పన లుగా ఉండేవంటే అతిశయోక్తికాదు. అప్పుడు అందంగా వెలువడిన చందమామను ఆసేతు హిమాచల పర్యంతం గల ప్రజలు అమితోత్సాహంతో అందుకుని ఆదరించారు.

ఎన్నో విప్లవాత్మకమైన మార్పులు చోటుచేసుకున్న ఇవాళ కూడా దేశవ్యాప్తంగా పన్నెండు భాషలు మాట్లాడుతూన్న పిన్నలూ, పెద్దలూ చందమామ చదవడం పట్ల ఆసక్తి కనబరచడం ఎంతో ఆనందం కలిగించే విషయం. ఇదెలా సాధ్యమయింది? మనిషి మనసులోని ఉన్నత మైన విలువలు. సత్యం-ధర్మం, నీతి-నిజాయితీ, ప్రేమ-ధైర్యం, దయ-కరుణ, వినయ విధేయతలు మొదలైన మానవతావిలువల పట్ల మనిషికున్న తరగని అనురక్తి. అందుకే అలాంటి విలువలను వివరించే కథలుగల చందమామను ఇంతగా ఆదరిస్తున్నారు.

చందమామ జ్ఞానాన్వేషణలో యువపాఠకులకు విడదీయరాని నేస్తంగా కొనసాగుతున్నది. ఈ అనుబంధం కొనసాగడమే గాక, మునుముందు మరింత దృఢ పడగలదని విశ్వసిస్తున్నాం. వజ్రోత్సవ ఉన్నత శిఖరాన్ని అధిగమిస్తూన్న ఈ తరుణంలో చందమామ వినోదాత్మక జ్ఞానా న్వేషణలో పిల్లలకు నేస్తంగా, పెద్దలకు హస్తభూషణంగా నిరంతరం కొనసాగగలదని భావిస్తున్నాం.

సంపాదకుడు : **విశ్వం**







చందమామ

చందా

ఎయిర్‌మెయిల్‌ద్వారా అన్నిదేశాలకు

పన్నెండు సంచికలు రూ: 900

ఇండియాలో బుక్‌పోస్ట్ ద్వారా

రూ.150.00

చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగానీ, మనిఆర్డర్ ద్వారాగానీ 'చందమామ ఇండియా లిమిటెడ్' పేరిట పంపండి.





**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
**to**
**Subscription Division**
**CHANDAMAMA INDIA LIMITED**
**82, Defence Officers Colony**
**Ekkatuthangal,**
**Chennai - 600 032**
**E-mail :**
**subscription@chandamama.org**




# పాఠకుల లేఖలు

**60** సంవత్సరాలుగా విజ్ఞాన వినోదాలు విరజిమ్ముతూన్న విశిష్ట పత్రిక చందమామ మే సంచిక హృద్యంగా ఉంది. ముఖచిత్రం బావుంది. మేకనవ్వింది జాతక కథ సందేశాత్మకంగా ఉంది. 'ఆట్టుక్కల్ పొంగల్'కు 25 లక్షల మంది మహిళలు హాజరుకావడం అద్భుతమైన విషయం. బుద్ధపూర్ణిమ సందర్భంగా వెలువరించిన వైశాఖ పూర్ణిమ విశేషాలు ఆసక్తికరంగా ఉన్నాయి.

-వాస్తు రామచంద్ర, నెల్లూరు - 2

మే సంచికలోని కథలన్నీ క్షుణ్ణంగా చదివాను. 'గురువు సలహా', 'నిద్రపట్టని పిశాచం' కొంచెం మట్టం. మిగిలిన కథలన్నీ చందమామ స్థాయికి తగినవే. ఉత్పలాక్షి ప్రేమ బేతాళ కథ, ప్రశ్న-జవాబు చక్కగా ఉన్నాయి. 'ఆలోచన' కొసమెరుపు బావుంది.

-డి. శంభుదాసు, విజయవాడ - 10

నాకు ఉద్యోగం వచ్చేంతవరకు 'చందమామ'ను క్రమం తప్పకుండా చదివే వాణ్ణి. మా తాతాయ్య, బామ్మ నెలనెలా 'సీరియల్స్'ను కట్ చేసి చక్కగా బౌండ్ చేసి పెట్టేవారు. దురదృష్టవశాత్తు వాటిని పోగొట్టుకున్నాము. ఇప్పుడు మళ్ళీ వస్తూన్న 'రాకాసిలోయ' సీరియల్‌తో పాటు 'విచిత్ర కవలలు' వస్తే కొని బౌండు చేయించుకోవాలనుకుంటున్నాము.

-ఎ. శ్రీరామకృష్ణ, రాజమండ్రి

**60** సంవత్సరాలు పూర్తిచేసుకుంటూన్న చందమామకు అభినందనలు. ఇది మామూలు కథల పత్రిక కాదు. ఉత్తమమైన విలువలను తెలియజేసే పత్రిక. చదివి పదికాలాల పాటు భద్రపరుచుకోతగిన సంపదలాంటిది.

-బిద్యుత్ భూషణ్ జీనా, భువనేశ్వర్



# అన్న-తమ్ముడు

ధర్మపురిలో సోమయాజులు, ఛయనులు అనే ఇద్దరు అన్నదమ్ములు ఉండేవారు. అన్న సోమయాజులు గొప్ప వేదపండితుడు. పూర్వాచార పరాయణుడు. దానికితోడు దేవీ ఉపాసకుడు. తెల్లవారు జామున లేచి, నదీ స్నానం చేసి పూజలో కూర్చుంటాడు. మూడు గంటల సేపు పూజాగృహం నుంచి వెలుపలికి రాడు. దేవికి నైవేద్యం పెట్టనిదే పచ్చి మంచి నీళ్ళు కూడా ముట్టడు. ఆయన పిలిస్తే దేవి పలుకుతుందని ఆ ఊళ్ళో అందరూ అనుకుంటారు. ఆయన ఆయుర్వేదం బాగా తెలిసినవాడేగాని, ఇంటికి వచ్చిన వాళ్ళకు తప్ప, ఎంతటి ప్రాణాపాయ స్థితిలో ఉన్నా, ఒకరింటికి వెళ్ళి వైద్యం చేసి ఎరుగడు.

ఆయన తమ్ముడు ఛయనులు వేదాలు చదివాడేగాని అన్న అంతటి పండితుడు కాడు. అన్నలాగా ఉపాసనాపరుడు గాక పోయినా, దేవీ భక్తుడు. ఆయుర్వేద వైద్యంలో మాత్రం అన్నను మించినవాడు. దానికి తోడు ఎవరు వచ్చి పిలిచినా, అది ఏ అపరాత్రి వేళ అయినప్పటికీ వాళ్ళ వెంట వెళ్ళి వైద్యం చేసి వస్తాడు.

ఒకసారి అర్ధరాత్రి సమయంలో పక్క ఊరి నుంచి ఇద్దరు వచ్చి, పిల్లవాడికి సంధిపాతం వచ్చి అపస్మారక స్థితిలో ఉన్నాడని మొరపెట్టుకుంటే, ఛయనులు ఇంట్లో భార్య ఒక్కతే ఉందని కూడా చూడకుండా మందులపెట్టె పట్టుకుని వాళ్ళ వెంట బయలుదేరాడు. వాళ్ళ ఊరు వెళ్ళే సరికి కోడి కూసింది. ఇంట్లో జనం అంతా ముగిసిపోయిందని పిల్లవాణ్ణి గడపలో పెట్టి లబో దిబో మంటున్నారు.

ఛయనులు వాళ్ళను పక్కకు తప్పించి నాడి చూశాడు. ఆ తరవాత ఏదో పొట్లం విప్పి, అందులోని భస్మాన్ని తేనెలో రంగరించి పిల్లవాడికి పట్టించాడు. గంట తరవాత పిల్లవాడిలో కదలిక వచ్చింది. ఇంట్లో వాళ్ళ ఆనందానికి అంతులేకుండా పోయింది. ఛయనులు

పి.వి.బి. శ్రీరామమూర్తి








రెండు గంటల తరవాత ఏదో కషాయం తయారు చేసి కళ్ళు తెరిచిన పిల్లవాడి చేత తాగించాడు. మరికొంత సేపటికి పిల్లవాడు లేచి కూర్చున్నాడు. ఇంట్లోని వాళ్ళందరూ కృతజ్ఞ తతో ఛయనులుకి చేతులెత్తి మొక్కారు.

అప్పటికే మధ్యాహ్నం కావడంతో ఛయ నులుకి ఆకలి ఎక్కువయింది. ఆ ఇంటి వారు, ''మా ఊళ్ళో పళ్ళు కూడా దొరకవు. పాలు తెస్తాం, తాగుతారా?'' అని అడిగారు.

''మీరు వండుకోలేదా?'' అని అడిగాడు ఛయనులు.

''వండుకున్నాం. కానీ... కానీ...'' అంటూ ఆగాడు ఆ ఇంటి యజమాని.

''పదండి. అందరూ కలిసే భోజనం చేద్దాం,'' అంటూ అరుగుపై నుంచి లేచాడు ఛయనులు. అందరితో కలిసి ఆనందంతో భోజనం చేసి వాళ్ళిచ్చింది పుచ్చుకుని సంతో షంగా ఇంటిదారి పట్టాడు.

ఈ వార్త ఆనోటా ఈనోటా నలిగి, ఆఖరికి సోమయాజులు చెవినిపడింది. మండిపడ్డాడు. తమ్ముణ్ణి పిలిచి చీవాట్లు పెట్టి ప్రాయశ్చిత్తం చేయాలన్నాడు. ఛయనులు, ''ఆకలి భరించ లేక, మరో మార్గం లేక ప్రాణాలు నిలుపుకోవ డానికి వాళ్ళింట్లో భోజనం చేయడం తప్పు కాదనుకుంటాను,'' అన్నాడు వినయంగా.

''చేసిన అపచారం చాలదని పెద్దవాడికి ఎదురు తిరుగుతున్నావా?'' అన్నాడు సోమ యాజులు ఆగ్రహంతో.

''అన్నీ తెలిసినవారు. మీకు చెప్పేంత వాణ్ణి కాను నేను. ప్రాణాలు నిలిపే ఆహారాన్ని ఎక్కడి నుంచి తీసుకున్నా తప్పులేదు,'' అన్నాడు ఛయనులు మళ్ళీ.

ఆ మాటలు సోమయాజులుకు మరింత ఆగ్రహం తెప్పించాయి. ''ఛీ, అప్రాచ్యుడా! అవతలికి వెళ్ళు. ఈ రోజు నుంచి నా తమ్ముడు లేడనుకుంటాను,'' అంటూ తలమీది నుంచి చేదతో నీళ్ళు కుమ్మరించుకున్నాడు.

ఛయనులు అన్నకు బాధ కలిగించినం దుకు చింతిస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

ఆ రోజు నుంచి సోమయాజుల ఇల్లు పండితులతో కళకళలాడుతూ ఉంటే, ఛయ నులు ఇంటికి సామాన్య ప్రజలు ఎక్కువగా వచ్చేవారు. ఆకలి అని ఎవరు వచ్చినా ఛయ నుల భార్య వాళ్ళకింత పెట్టి పంపేది.

ఇలా వుండగా ఒకసారి ఐదారు రోజుల పాటు ఎడతెరిపిలేని జడివానతో పెను తుఫాను

ఊరిని చుట్టు ముట్టింది. భయనులు ఏర్పాటు చేసిన పాకలో బీదా బిక్కీ జనం వచ్చి ప్రాణాలు ఉగ్గబట్టుకుని కూర్చున్నారు.

సోమయాజులు, పూజాసమయం కావడంతో పూజాగృహంలో కూర్చుని ధ్యాన నిమగ్నుడయ్యాడు. హఠాత్తుగా ఆయన ధ్యానం చేస్తూన్న పూజాగృహం తప్ప, తక్కిన భవంతి, యజ్ఞశాల గోడలు తడిసి భయంకర శబ్దంతో కూలిపోయాయి. సోమయాజులు ఉలిక్కిపడిలేచి, కిటికీలోంచి చూస్తే, తమ్ముడి భోజనాల తాటిపాక సురక్షితంగా కనిపించింది. సోమయాజులు ఆగ్రహావేశంతో దేవీ విగ్రహం పాదాల ముందు ప్రాణత్యాగం చేయాలని తలమోదుకుంటూ, "తల్లీ, ఏమిటీదారుణం? నీకు నైవేద్యం పెట్టకుండా నేను ఏనాడైనా పచ్చినీళ్ళయినా ముట్టానా? సదాచారంతో, నిష్ఠతో నిన్ను పూజించిన నా ఇంటిని నేలమట్టం చేసి, ఆచారాలను మంటగలిపి, నీ సంగతే మరిచిన నా తమ్ముడి తాటిపాకను చెక్కుచెదరకుండా కాపాడావు? ఇది దుర్న్యాయం కాదా?" అంటూ విలపించసాగాడు.

"పిచ్చివాడా, ఆగు! ఏమిటి నువ్వంటున్నది? నువ్వు నా భక్తుడివే, నిజం. అయితే భక్తుడినన్న అహంకారంతో, ఆచారాలతో తోటి మానవులకు దూరమై ఒంటరివాడివైపోయావు. నీ తమ్ముడూ నా భక్తుడే. నువ్వు నీ ఎదుట వున్న విగ్రహంలోనే నన్ను చూస్తున్నావు. నీ తమ్ముడు ప్రతి జీవరాశిలోనూ నన్ను దర్శిస్తున్నాడు. తనతో పాటు అందరూ బావుండాలని అతడు కోరుకుంటున్నాడు. అలాంటి వాణ్ణీ, అతన్ని ఆశ్రయించిన పేద ప్రజలనూ కాపాడడం నా బాధ్యత కాదా? పైగా ప్రకృతి విలయతాండవం చేస్తూన్న ఇంతటి ప్రళయంలోనూ, నిన్నూ, నీ భార్యా బిడ్డలనూ కాపాడాను కదా! ఆ సంగతి మరిచిపోయి నన్నే తప్పుపడతావా?" అన్న మాటలు దేవీ విగ్రహం నుంచి గంభీరంగా వినిపించాయి.

ఆ మాటలతో తన తప్పు గ్రహించిన సోమయాజులు, "తల్లీ, నా తప్పు తెలుసుకున్నాను. నన్ను క్షమించు. ఇకపై నీ ఆజ్ఞానుసారం వయసులో చిన్నవాడైనా జ్ఞానంలో పెద్దవాడైన నా తమ్ముడి అడుగుజాడలలో నడుస్తాను," అంటూ చేతులు జోడించాడు.





# పనితనం

రఘువీరపురాన్ని పరిపాలించే శశికాంతుడు గొప్ప కళాపోషకుడు. ముఖ్యంగా శిల్పకళల పట్ల ఆయన ఎక్కువ ఆసక్తి కనబరచేవాడు. నయనానందం కలిగించే శిల్పాలతో ఆలయాలూ, కోటలూ, భవనాలూ నిర్మించడం అంటే ఆయనకు మహా ఇష్టం. ఆయన పాలనలో ఎప్పుడూ ఏదో ఒకచోట భవనాల నిర్మాణం జరుగుతూనే ఉండేది. శశికాంతుడు కొత్తగా చేపట్టిన చంద్రభవన నిర్మాణం పూర్తి కావస్తూండగా, భవనం లోపల చెక్క నగిషీలు చెక్కి, అలంకరించడానికి నిపుణుడైన వడ్రంగి కావలసివచ్చాడు. రాజు మంత్రి రమానందుడికీ సంగతి చెప్పి మంచి పనితనం గల వడ్రంగిని ఎంపిక చేసి, ఆ పనిని అతనికి అప్పగించమని ఆదేశించాడు.

మంత్రి వాకబు చేయగా రాజధాని సమీప గ్రామంలోనే చెక్కపనిలో మంచి నిపుణుడైన కుండలుడనే వడ్రంగి ఉన్నాడని తెలియవచ్చింది. మంత్రి కుండలుణ్ణి పిలిపించి సంగతి చెప్పాడు. అంతావిన్న కుండలుడు, "అయ్యా, తమరు నామీద నమ్మకం ఉంచి నన్ను పిలిపించినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. చంద్రభవనంలో నగిషీలు చెక్కే అవకాశం రావడం మహా భాగ్యంగా భావిస్తున్నాను. అయితే, వయసు పైబడడంవల్ల ఇటీవల నాకు చూపు సరిగా ఆనడం లేదు. కాబట్టిసక్రమంగా పనిచేయలేకపోతున్నాను. మీరిచ్చిన అవకాశాన్ని ఉపయోగించుకోలేక పోతున్నందుకు క్షమించండి," అన్నాడు వినయంగా.

"మరి, ఆ పనిచేయడానికి సమర్థులైన వారు నీ ఎరుకలో ఎవరైనా ఉన్నారా?" అని అడిగాడు మంత్రి.

"ఉన్నారు, ప్రభూ! ఎవరో ఎందుకు? చారకుడు, సుజాతువు, ధరణకుడు అనే నా

టి. రాజేంద్ర

ముగ్గురు కొడుకులూ అందుకు సమర్థులే. ముగ్గురూ మూడు విధాలైన ప్రత్యేకతలు కలిగినవారు. వారి పనితనాన్ని తమరే స్వయంగా పరీక్షించి ఒకరిని ఎంపిక చేసుకోవచ్చు. ముగ్గురూ కూడా తమ వృత్తిలో ఒకరిని మించిన వారు మరొకరు. అయితే, స్పర్థలూ, ఈర్ష్యా ద్వేషాలూ లేకుండా కలిసికట్టుగా పనిచేస్తూ, చేసే వృత్తినే దైవంగా భావించే సాత్వికస్వభావులు,'' అన్నాడు కుండలుడు.

''సరే, ముగ్గురినీ రేపే నా వద్దకు పంపించు,'' అన్నాడు మంత్రి.



మరునాడు వచ్చిన ముగ్గురు అన్నదమ్ములకు మంత్రి, విషయం వివరించి ముగ్గురినీ వారు తమ నైపుణ్యాన్ని చాటే విధంగా తయారు చేసిన వస్తువులను తీసుకురమ్మని చెప్పాడు.

మరో రెండు రోజులలో చారకుడు ఒక కుర్చీనీ, సుజాతువు ఎత్తు పీటనూ, ధరణకుడు పెట్టెనూ తెచ్చి చూపారు. ముగ్గురు తెచ్చిన మూడు వస్తువులనూ ఒక చోట ఉంచి పరిశీలించాడు మంత్రి. చారకుడు చేసిన కుర్చీ మంచి పనితనంతో అందంగా కనిపించింది. తన అభిప్రాయాన్ని రూఢి చేసుకోవడానికి, కొందరు రాజోద్యోగులకు వాటిని చూపించాడు. వాళ్ళందరూ కూడా చారకుడు చేసిన కుర్చీ మిగతా రెండింటికన్నా మంచి పనితనంతో ఉందని అభిప్రాయపడ్డారు.

ఆ రోజు సాయంకాలమే మంత్రి, ఉద్యానవనంలో పచార్లు చేస్తున్న రాజును కలుసుకుని ముగ్గురు వడ్రంగులు చేసిన వస్తువులను గురించి చెప్పి, ''తమరు ఒకసారి ఆ వస్తువులను పరిశీలించి, సమ్మత మనుకుంటే, భవనం పనులను చారకుడికి అప్పగించవచ్చు,'' అన్నాడు.

రాజు శశికాంతుడు మరునాడు ముగ్గురు వడ్రంగులు చేసిన వస్తువులను చూసి, ''ముగ్గురు మూడు రకాల వస్తువులను కాదు. ముగ్గురినీ ఒకే రకమైన వస్తువుకు నమూనాను తయారుచేయమని చెప్పండి. అప్పుడే చేసిన వారి ఊహాశక్తి, శక్తి సామర్థ్యాల ప్రత్యేకతలు స్పష్టంగా బయటపడతాయి,'' అన్నాడు.

మంత్రి ముగ్గురు అన్నదమ్ములను పిలిచి, ఒక తల్పం నమూనా చేయవలసిందిగా పురమాయించాడు. మూడు రోజులు ఆలోచించి ముగ్గురు మూడు రకాల నమూనాలు







రూపొందించారు. వాటిలో చారకుడు రూపొం దించిన తల్పం, అందంగా ఆకర్షణీయంగా ఉంది. సుజాతువు చేసిన తల్పం మెచ్చుకు నేలా ఉంది. ధరణకుడు తయారు చేసిన తల్పం నమూనాలో పనితనం లేదుగాని కొత్తగా కనిపించింది.

శశికాంతుడు మూడింటినీ కొంతసేపు పరిశీలించి చూసి, ధరణకుణ్ణి ప్రధాన వడ్రంగి గానూ, చారకుణ్ణి, సుజాతువును అతనికి సహాయకులుగానూ, నియమించమని మంత్రిని ఆదేశించాడు.

ఆ మాటవిని అక్కడున్న రాజోద్యోగులతో పాటు, మంత్రి రమానందుడు కూడా ఆశ్చర్య పోయాడు. రాజు మంత్రి కేసి మందహాసం చేస్తూ, ''నా నిర్ణయం మీకు విస్మయం కలి గించవచ్చు. అయినా, అది సరైనదే. చార కుడు, సుజాతువు అద్భుతమైన పనితనం కలవారే. అందులో ఎలాంటి సందేహమూ లేదు. ధరణకుడు చేసిన తల్పం నమూనాలో పనితనం లేదు. కానీ కొత్తదనం ఉంది. చూడ డానికి తక్కిన రెండింటికన్నా వినూత్నంగానూ, విలక్షణంగానూ ఉన్నది. అవునా?'' అని అడిగాడు.

అవును అన్నట్టు తల ఊపాడు మంత్రి.

''అంతే కాదు; అది పవళించడానికి ఉద్దేశించిన తల్పమే అయినప్పటికీ, దానిలో కొద్దిపాటి మార్పులు చేస్తే సౌకర్యంగా కూర్చోవడానికి వీలుగా తయారవుతుంది. అలాంటి సదుపాయం మిగిలిన వాటిలో కనిపించదు. ధరణకుడిలో సునిశితమైన పనితనం అంతగా లేకపోయినప్పటికీ, వారిద్దరిలో లేని సృజనాత్మకత, ప్రత్యేకత ఉన్నాయి. అతడు నమూనాలు తయారుచేసి ఇచ్చినట్టయితే, మిగిలిన ఇద్దరూ తమ సునిశితమైన పనితనంతో వాటికి మెరు గులుదిద్ది అద్భుతాలు సృష్టించగలరు. ఆ ముగ్గురి నైపుణ్యంతో చంద్రభవనం అత్య ద్భుత కళానిలయంగా శోభిల్లగలదు,'' అన్నాడు రాజు.

ఆయన మాటల్లోని సత్యం గ్రహించి మంత్రితో పాటు రాజోద్యోగులు కూడా పరమా నందం చెందారు.






# రాకాసిలోయ

## 23

[కేశవుడూ, అతడి అనుచరులూ గుహకందరాల్లో పడి, తిరిగి తిరిగి అతి కష్టం మీద కొంత సేపటికి బయిటికి వచ్చారు. అక్కడికి కొద్ది దూరంలో జింకలను చంపేందుకు కారట్లాడుతున్న కొన్ని తోడేళ్ళు వాళ్ళ మీద పడినై. వాటిని చంపి, ముగ్గురూ అడవిలోకి బయలుదేరేంతలో, అన్ని వైపుల నుంచీ రాళ్ళూ, రప్పలూ, కర్ర ముక్కలూ జడివానలా వాళ్ళ మీదికి వచ్చి పడసాగినై. -తరవాత]

కేశవుడు తను దాక్కున్న రాతి చాటు నుంచి మెల్లగా పాకుతూ, జయమల్లూ, కోయగోమాంగ్‌లు వున్న చోటుకు వెళ్ళి చిన్న గొంతుతో, ''జయమల్లూ! మనం తిరిగి నరభక్షకుల వాతపడలేదు గదా?'' అని ప్రశ్నించాడు.

జయమల్లు అడ్డంగా తలాడిస్తూ, ''వీళ్ళు నరభక్షకులైవుండరు. ఇంత నిశ్శబ్దంగా, మన కంటికి కనపడకుండా దాగివుండి, మన మీద దాడి చేస్తున్నారంటే, వీళ్ళెవరో మరొక జాతి మానవులు. నరభక్షకులైతే పెద్ద రణగొణ ధ్వని చేసేవాళ్ళు,'' అన్నాడు. కేశవుడు మరేదో మాట్లాడబోయేంతలో రాళ్ళుపడటం ఆగిపోయింది. జయమల్లు వున్న చోటు నుంచి మోకాళ్ళమీద లేచి, ముందుకు చూశాడు. అతడితోపాటు కేశవుడూ, కోయగోమాంగ్ లేవబోయేంతలో, చెట్ల చాటు నుంచి పెద్ద కేక వినబడింది: ''వాళ్ళ ముగ్గుర్నీ ప్రాణాలతో పట్టుకోండి. రెక్కల మనుషులకు ఇద్దాం. మన జాతి వాళ్ళు ముగ్గురు బతికినా బతికినట్టే!''

'చందమామ'



రెక్కల మనుషులు, మన జాతివాళ్ళు; అన్న మాటలు వింటూనే, జయమల్లు ఎగిరి లేచి నిలబడి, ''ఇక అడవి లోపలికి పరిగెత్తుదాం రండి,'' అంటూ గుబురుగావున్న చెట్ల కేసి పరిగెత్తసాగాడు. కేశవుడూ, కోయ గోమాంగ్ అతణ్ణి అనుసరించబోయేంతలో, దుక్కలా వున్న ఒక అడవిజాతివాడు పెద్ద కర్రతో గోమాంగ్ మీదికి వచ్చాడు. గోమాంగ్ ఆ కర్రతోనే, వాణ్ణి మెడ మీద గట్టిగా పొడిచి ముందుకు పరిగెత్తాడు. కేశవుడు కూడా అతణ్ణి అనుసరించాడు.

అడవిలోకి చాలా దూరం పరిగెత్తిన తరవాత ముగ్గురూ రొప్పుతూ రోస్తూ ఒకచెట్టు కింద కూచున్నారు. శత్రువులు తమను తరుముకురావటం లేదన్న నమ్మకం వాళ్ళకు కలిగింది. 'రెక్కల మనుషులు' అన్న మాట కోయగోమాంగ్‌కు బెదురు పుట్టించింది. అతడు కేశవుడి కేసి భయంగా చూస్తూ, ''కేశవా, ఆ అడవిజాతివాళ్ళు అన్న మాటలు విన్నావు గదా? వాళ్ళకు రెక్కల మనుషులు తెలుసు!'' అన్నాడు.

''అవును, రెక్కల మనుషు లేమిటి? ఇదేదో వింతగా వున్నదే!'' అన్నాడు కేశవుడు.

''మీ ఇద్దరూ అలాంటివాళ్ళు వున్నారని ఎప్పుడూ వినలేదా?'' అని ప్రశ్నించాడు కోయ గోమాంగ్. కేశవుడూ, జయమల్లూ కూడా లేదన్నట్టు అడ్డంగా తలలు వూపారు.

''పక్షుల్లా ఎగిరే, రెక్కల మనుషులనే వాళ్ళు వున్నారు. కాని, ఎక్కడ వున్నారో మాత్రం మా కోయవాళ్ళకు తెలియదు. వున్నట్టు మాత్రం విన్నాం. వాళ్ళు మహా క్రూరులు,'' అన్నాడు కోయగోమాంగ్.

''పక్షుల్లాగా ఎగిరే మనుషులు వుండటం అసంభవం. నేను నమ్మను,'' అన్నాడు జయమల్లు.

''అయితే, ఆ అడవి మనుషులు వేసిన కేక అర్థం ఏమిటి?'' అన్నాడు కేశవుడు.

''ఏమో! నా కర్థం కావటంలేదు,'' అంటూ జయమల్లు లేవబోయేంతలో, ''అయ్యో, రెక్కలమనిషి, చచ్చాం!'' అన్న పెద్ద ఆర్తనాదం వినబడింది.

ఆ ఆర్తనాదం వింటూనే ముగ్గురూ అటు కేసి పరిగెత్తారు. ఒక అడవిమనిషి ప్రాణ భయంతో వణికిపోతూ అరుస్తున్నాడు. అతడికి కొంచెం ముందుగా నడుస్తున్న మరొకణ్ణి, చెట్టుకొమ్మ మీది నుంచి దూకిన పక్షిలాంటి పెద్ద ఆకారం ఒకటి, అంత ఎత్తుకు లేపి, దూరంగా విసిరివేసింది.

"రాకాసిపక్షి!" అంటూ కోయగోమాంగ్ కేకపెట్టాడు. అంతలో ముగ్గురూ కేకలు పెడుతున్న అడవిమనిషిని సమీపించి, "నీ స్నేహితుణ్ణి రక్షించే ప్రయత్నం ఏమీ చెయ్యక, అలా గగ్గోలుపడి పోతావేం!" అన్నారు.

మాటలు వింటూనే అడవిమనిషి చప్పున వెనుదిరిగి చూసి, ప్రాణం తేరుకున్నవాడిలా ముఖం పెట్టి, "రెక్కలమనిషికి చిక్కినవాణ్ణి రక్షించటం ఎవరితరం అవుతుంది? పైగా, వాళ్ళు మా గుహావాసులమీద పగబట్టివు న్నారు. వాళ్ళ దేవత కోసం బలికి పంపవలసిన ఇద్దర్ని మేం పంపలేదు," అన్నాడు.

జయమల్లు అందరికన్న ముందుగా పరిగెత్తి, రెక్కలమనిషి విసిరివేసినవాణ్ణి సమీ పించి, వాడిలో ఏమైనా ప్రాణం వుందో లేదో అని పరీక్షించి చూశాడు. కాని, వాడప్పటికే మరణించాడు. "వీడు సగం భయంతో గుండె లాగి చచ్చాడని నా అనుమానం. అంత ఎత్తు నుంచి మనిషిపడితే, ఏ కాళ్ళు చేతులో విర గొచ్చు గాని, చావు ఇంత తొందరగా రాదు," అన్నాడు జయమల్లు.

"ఇంతకూ ఆ రెక్కలమనిషెక్కడ?" అంటూ కేశవుడు తల పైకెత్తి చెట్టుకొమ్మల్లోకి చూశాడు.

"వాడింకెక్కడుంటాడు? ఆకాశంలోకి ఎగిరిపోయాడు," అన్నాడు అడవిమనిషి.

జయమల్లు ఆలోచనలో పడ్డాడు. అడవి మనిషిని చంపినవాడు రెక్కలమనిషి అనేం దుకు సందేహం లేదు. పొడవైన పెద్దరెక్కలూ, మామూలు మనిషికి వున్నట్టు కాళ్ళూ చేతులూ వాడికి వున్నవి. వాడు నిజంగానే



ఆకాశంలోకి ఎగిరిపోగలడా? మనిషైనవాడికి అదెలా సాధ్యం? వాడు గొప్ప మంత్రవేత్తా?

"ఆ ఎగిరేమనుషులు ఎందరుంటారు? ఎక్కడుంటారు?" అని ప్రశ్నించాడు జయ మల్లు, అడవిమనిషిని. వాళ్ళు చాలామంది వున్నారనీ, కాని, సంఖ్య తెలియదనీ చెప్పి, వాడు జయమల్లుకు పడమటి దిక్కు చూపిస్తూ, "అదుగో, ఆ కొండల వెనక ఎక్కడో వాళ్ళుండే ప్రదేశం వున్నది. అక్కడకు వెళ్ళి ప్రాణాలతో తిరిగివచ్చిన వాళ్ళెవరూ లేరు," అన్నాడు.

ఈ మాటలు వింటూనే జయమల్లు, కేశవుడి కేసి తిరిగి, "కేశవా! ఇందులో ఏదో మోసం వున్నది. ఎగిరేమనిషంటూ ఎవడో ఒకడు... ఏ మంత్రశక్తివల్లనో, మరే అద్భుత సాధనవల్లనో వుండవచ్చు గాని-వందలా వేల సంఖ్యలో అలాంటి వాళ్ళు వుండేందుకు




అవకాశంలేదు. ఈ రహస్యం ఏమిటో తెలుసుకోవాలి,'' అన్నాడు.

''అలాగే చేద్దాం. ఆ ఎగిరేశక్తి ఎలా వస్తుందో గ్రహిస్తే, మనం దారి పొడుగునా ఈ ప్రమాదాలకు గురి కాకుండా, సూటిగా ఎగిరిపోయి రాకాసిలోయలో వాలవచ్చు,'' అన్నాడు కేశవుడు.

హఠాత్తుగా వాళ్ళు నిలబడి వున్న చోటుకు అన్ని వైపుల నుంచీ పెద్ద కలకలం బయలుదేరింది. కనుమూసి తెరిచేంతలో, నలభై యాభై మంది అడవిమనుషులు పెద్ద పెద్ద ఈటెలు ఊపుతూ వాళ్ళను చుట్టుముట్టి, అంత దూరాన్నుంచే, ''లొంగిపొండి, పారిపోయేందుకు ప్రయత్నించారో, చంపుతాం!'' అంటూ కేకలు పెట్టారు.

కేశవుడు చప్పున తమ పక్కన నిలబడివున్న అడవి మనిషిని ముందుకు లాగి, అతడి వెనక బాణం ఎక్కు పెట్టి నిలబడ్డాడు. జయమల్లూ, కోయగోమాంగ్ కూడా చెరొకవైపుకూ తిరిగి అడవిమనుషుల కేసి బాణాలు గురి పెట్టారు. జయమల్లు కంచు కంఠంతో, 'మేం ప్రాణాలతో మీకు దొరకటం కల్ల. మేం చచ్చే ముందు మీలో సగం మందిని చంపుతాం. మీతో మాకు శత్రుత్వం లేదు. మా దారిన మమ్మల్ని పోనివ్వండి,'' అని కేకపెట్టాడు. కేశవుడి ముందు నిలబడి వున్న అడవిమనిషి, తన జాతివాళ్ళ కేసి చేయి ఊపుతూ, ''వీళ్ళకేమీ హాని చెయ్యకండి. రెక్కలమనిషి నుంచి నన్ను కాపాడారు,'' అని అరిచాడు.

''కావాలంటే మీ గుహావాసులందర్నీ, రెక్కల మనుషుల నుంచి కాపాడగలం. మా బాణాలకు ఈ లోకంలో తిరుగు లేదు,'' అన్నాడు కేశవుడు.

అడవిమనుషులంతా ఒకళ్ళను చూసి మరొకళ్ళు ఈటెలు దించారు. వాళ్ళ నాయకుడైన వృద్ధుడు ఈటెను తల్లకిందులుగా పట్టుకుని ముందుకు వస్తూ, ''నిజంగా మీరు మాకు రెక్కలమనుషుల నుంచి రక్షణ కల్పించగలరా? ఎంతో కాలంగా వాళ్ళ దేవతకు రోజుకు ఇద్దరు చొప్పున మా జాతివాళ్ళను బలికి ఒప్ప చెపుతున్నాం,'' అన్నాడు.

''మీకు రక్షణ ఇవ్వటమే కాదు, మొత్తం ఆ రెక్కలమానవజాతిని సర్వనాశనం చేస్తాం. మా మాట నమ్మండి,'' అన్నాడు జయమల్లు.

అడవి మనుషుల నాయకుడు, తన ఈటెను దూరంగా విసిరివేశాడు. అతడి అనుచరులంతా తమ ఈటెలను కూడా అదే ప్రదేశంలో ఒక గుట్టగా పడవేశారు. కేశవుడూ,

అతడి స్నేహితులూ విల్లంబులు దించారు. అడవిమనుషుల నాయకుడు కేశవుణ్ణి సమీపించి, అతడి విల్లును పరీక్షించి చూస్తూ, ''ఇలాంటి ఆయుధాలు వాడటం మా చేత కాదు. రెక్కలమనుషుల్లో కొందరు వీటిని ఉపయోగించటం చూసిన వాళ్ళున్నారు. మీరు నిజంగా వాళ్ళకు సమఉజ్జీలు. మాకు వాళ్ళ బెడద వదిలించండి. రోజుకు మా జాతి వాళ్ళిద్దర్ని పొట్టనపెట్టుకుంటున్నారు. మీకు మా చేతనైన సహాయం చేస్తాం,'' అన్నాడు.

''మీకు రాకాసిలోయకు దారి తెలుసా?'' అన్నాడు కోయగోమాంగ్. జయమల్లు కోపంగా అతణ్ణి వారించి, ''ఆ సంగతులు మాట్లాడేందుకు ఇది తగినసమయం కాదు. సరే, రెక్కల మనుషులకు బలిగా రోజూ మీరు పంపే ఇద్దర్నీ ఏ ప్రదేశంలో ఆ దుర్మార్గులకు ఒప్పచెపుతారు?'' అని అడిగాడు.

అడవిమనుషుల నాయకుడు తల ఎత్తి చెట్లచాటు నుంచి కొంచెంగా కనబడుతున్న ఒక కొండ శిఖరాన్ని చూపుతూ, ''ఆ ప్రదేశం ఇక్కడికి అరకోసు దూరంలో వుంటుంది. చీకటి పడగానే, మేము నిర్ణయించిన మా జాతి వాళ్ళిద్దరు అక్కడికి వెళతారు. వాళ్ళను ఆ రెక్కల మనుషులు ఎత్తుకు పోతారు,'' అని చెప్పాడు.

''వాళ్ళెంతమంది అక్కడికి వస్తారు? మీరు బలికి పంపిన వాళ్ళిద్దర్నీ ఏ విధంగా ఎత్తుకు పోతారు?'' అని జయమల్లు అడిగాడు.

''వాళ్ళెంతమంది వస్తారో, ఏవిధంగా ఎత్తుకు పోతారో చూసినవాళ్ళెవరూ లేరు. కాని, మా వాళ్ళను కాళ్ళతో పట్టుకుని, వాళ్ళు



ఆకాశంలోకి లేచి పోతారని చెప్పుకుంటారు. అందులో వున్న నిజం ఎంతో నాకు తెలియదు,'' అన్నాడు అడవి మనుషుల నాయకుడు.

''అయితే, ఇక మీరు వెళ్ళి ఆ బలికి పంపేవాళ్ళను పంపండి. మా ప్రయత్నంలో మేముంటాం. రేపు ఉదయానికల్లా, మీరు పంపిన వాళ్ళిద్దర్నీ వెంటపెట్టుకుని రావటమే గాక, మిమ్మల్ని పీడిస్తూన్న ఆ దుర్మార్గుల అసలు రహస్యమేమిటో కూడా తెలుసుకు వస్తాం. ఇంతకూ, మీరుండే గ్రామం ఎక్కడ?'' అని అడిగాడు జయమల్లు.

''మేము కొండ గుహల్లో నివసిస్తాం. మేము అనాదిగా గుహావాసులం. మిమ్మల్ని కలుసుకునేందుకు రేపు సూర్యోదయానికల్లా ఇక్కడికి వస్తాం,'' అన్నాడు గుహావాసుల నాయకుడు. తరవాత అతడు తన అనుచరులతో వెళ్ళిపోయాడు. కేశవుడూ వాళ్ళు, కొండ





శిఖరం కేసి నడిచారు. దారిలో కోయగోమాంగ్ రెండు కుందేళ్ళను కొట్టి, వాటి కాల్చిన మాంసంలో స్నేహితులిద్దరికీ భాగం పెట్టాడు.

ముగ్గురూ కొండ ప్రాంతానికి చేరేసరికి బాగా చీకటి పడిపోయింది. అంతలో చంద్రోదయ మయింది. ఆ వెలుగులో చెట్ల నీడల కింద నడుస్తున్న వాళ్ళకు, కొంచెం ఎడంలో ఏదో అలికిడి అయిన ధ్వని వినబడింది. ముగ్గురూ పొదలచాటుకు వెళ్ళి నక్కి కూచున్నారు. అల్లంత దూరంలో, ఒక పెద్ద వృక్షం కింద ఇద్దరు నిలబడివున్నారు. వాళ్ళల్లో ఒకడు రెండవ వాడికి ఏదో హెచ్చరిక చేశాడు. ఆ వెంటనే ఇద్దరూ చెట్టుబోదె పట్టుకుని పైకి పాకసాగారు.

''చూశావా, వాళ్ళ రెక్కలు!'' అన్నాడు కేశవుడు, మెల్లగా జయమల్లుతో. జయమల్లు తల వూపాడు. అంతలో ఆ చెట్టు కేసి మరో ఇద్దరు వస్తున్నారు.

కోయగోమాంగ్ వాళ్ళ కేసి పరీక్షగా చూసి, ''వాళ్ళిద్దరూ గుహా వాసులు. రెక్కల మనుషుల దేవతకు బలి పశువులుగా పంపబడ్డ వాళ్ళు,'' అన్నాడు.

''వాళ్ళను రక్షిస్తామని మనం మాట ఇచ్చాం!'' అన్నాడు కేశవుడు. జయమల్లు అవునంటూ తల వూపి బాణం ఎక్కుపెట్టి ముందుకు కదిలాడు. కేశవుడూ, గోమాంగ్ కూడా బాణాలు ఎక్కుపెట్టి ముందుకు నడిచారు. ''నాకు ఆ దుర్మార్గుల తంత్రమేమిటో చాలావరకు తెలిసిపోయింది. వాళ్ళిద్దర్లో ఏ ఒకడూ ప్రాణాలతో పారిపోకూడదు. తెలిసిందా?'' అన్నాడు జయమల్లు.

''వాళ్ళు గుహావాసుల్ని తన్నుకుని ఆకాశంలోకి ఎగరక ముందే, మనం కొట్టాలి. అలా కాకపోతే మన బాణం దెబ్బకు అందరు,'' అన్నాడు కోయగోమాంగ్.

అంతలో, ''రాకాసిపక్షి మాతకూ, జై,'' అన్న అరుపు మాను చిటారు కొమ్మల్లో మారుమోగింది. ఆ వెంటనే రెండు నల్లని ఆకారాలు, రెక్కలు టపటప లాడిస్తూ, చెట్టు కింద నిలబడిన గుహావాసుల మీదికి రాసాగినై. కేశవుడూ, జయమల్లూ, కోయగోమాంగ్ వింటి తాళ్ళను చెవివరకూ లాగి, జుయ్ మంటూ మూడు బాణాలను వాటి మీదికి వదిలారు. -(ఇంకావుంది)





# సంజీవనీ మంత్రం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఎలాంటి లోకకల్యాణం కాంక్షించి అర్ధరాత్రి సమయంలో ఇలా ఇక్కట్లుపడుతున్నావో నాకు తెలియదు. అయితే, చాలా మంది అవకాశం లభించేంతవరకు ప్రజాక్షేమం, లోకకల్యాణం అంటూ సిద్ధాంతాలు వల్లించి, తీరా అవకాశం రాగానే స్వార్థానికి పాల్పడుతూ ఉంటారు. తండ్రి ఆరోగ్యం కోసమని అద్భుతశక్తిని కష్టపడి సంపాదించి, స్వప్రయోజనం కోసం వేరొక కపట వర్తనుడైన సాధువుకు సమర్పించిన మాధవుడనే యువకుడి కథ

బేతాళ కథలు



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

రంగాపురంలో కేశవయ్య పెద్ద భూస్వామి. ఆయన కొడుకు రాఘవయ్య మితిమీరిన గారాబంవల్ల చెడుసావాసాలు పట్టాడు. యుక్త వయస్కుడయ్యే సరికి అనేక దురలవాట్లకు లోనయ్యాడు. పెళ్ళి చేస్తే బాగుపడతాడని జానకితో అతడి పెళ్ళి జరిపించాడు కేశవయ్య.

భర్త తనను పట్టించుకోకపోయినా, జానకి పతియే ప్రత్యక్షదైవమని భావించి సేవలు చేసేది. అంతమంచి భార్య లభించినా రాఘవయ్య తన పాత అలవాట్లు మార్చుకోలేదు.

పిల్లలు పుడితే కొడుకులో మార్పు వస్తుందని కేశవయ్య దంపతులు ఆశపడ్డారు. కానీ, పెళ్ళయి పదేళ్ళయినా జానకి కడుపు పండలేదు. ఇలా వుండగా దర్శనుడనే సాధువు రంగాపురం వచ్చాడు. కేశవయ్య ఆయనకు తన గోడు చెప్పుకున్నాడు. సాధువు నవ్వి, ''నీ కొడుకు రాఘవయ్య దురలవాట్ల కారణంగా ఎప్పుడో మంచాన పడవలసింది. కానీ, నీ కోడలు జానకి మహా పతివ్రత. ఆమె చేస్తున్న సేవలు, పూజలే అతడి ఆరోగ్యాన్ని కాపాడుతున్నాయి. సంతానం కలిగితే ఆమె పిల్లల సేవలోపడి, భర్తపట్ల ఏకాగ్రత కోల్పోతే, అది భర్తకు ప్రమాదం. ఆ మహా పతివ్రత నొచ్చుకుంటుందని దేవుడామెకు సంతానం లేకుండా చేశాడు,'' అన్నాడు.

''ఐతే, మా వంశం రాఘవయ్యతో అంతం కావలసిందేనా?'' అని అడిగాడు కేశవయ్య దిగులుగా.

''జానకికి కొడుకు పుడితే రాఘవయ్య అనారోగ్యం పాలైనా, నీ మనవడు గొప్పవాడై నీ వంశం ప్రతిష్ఠలు పెంచుతాడు. నువ్వు సరేనంటే నీ వంశం కొనసాగే ఉపాయం చెబుతాను,'' అన్నాడు దర్శనుడు.

కేశవయ్య కాసేపు ఆలోచించి, ''చెడ్డపేరు తెస్తున్న కొడుకు కంటే, వంశానికి పేరు తెచ్చే మనవడే నాకు ముఖ్యం,'' అన్నాడు.

అప్పుడాయన చేతికి ఒక జామపండిచ్చి, ''ఇది దైవప్రసాదం. నీ కోడలిని తినమని ఇవ్వు. నీ అభీష్టం సిద్ధిస్తుంది,'' అన్నాడు దర్శనుడు.

అలా జానకి కడుపుపండి మాధవుడు పుట్టాడు. రాఘవయ్యకు కొడుకంటే వల్లమాలిన ప్రేమ. మాధవుడికి కూడా తండ్రిని చూడగానే చెప్పలేనంత ఉత్సాహం పుట్టుకొచ్చేది. అది చూసి జానకి సంబరపడేది.

ఒకనాడు మాధవుడు ఐదేళ్ళ వయసుకే తండ్రి అలవాట్లను అనుకరించబోయాడు. దీన్ని చూసిన కేశవయ్య, ''మీనాన్న మంచి వాడేకానీ, వాడి అలవాట్లు మంచివి కావు. చెడ్డ అలవాట్లున్న వారిని దేవుడు అనారోగ్యంతో శిక్షిస్తాడు. కాబట్టి నీకు మీనాన్న ఎంత ఇష్టమైనా, వాడి అలవాట్లకు దూరంగా వుండడం శ్రేయస్కరం,'' అని హెచ్చరించాడు.

''నా సంగతి సరే. మరి నాన్నకు చెడు అలవాట్లున్నాయి కదా? దేవుడు శిక్షించకుండా నాన్నను కాపాడ్డం ఎలా?'' అని అడిగాడు మాధవుడు కలవరంతో.

''నువ్వు నియమనిష్ఠలు పాటిస్తూ, ప్రతి రోజూ, మీ నాన్న ఆరోగ్యం కోసం దేవుణ్ణి ప్రార్థించు. మంచి పిల్లల కోరికల్ని దేవుడు తప్పక తీరుస్తాడు,'' అన్నాడు కేశవయ్య.

తండ్రి మీది ప్రేమతో రోజూ తాత చెప్పినట్టే చేశాడు మాధవుడు. వాడు పదేళ్ళవాడయ్యే సరికి రాఘవయ్య ఆరోగ్యం చెడింది. వాడికి పదిహేనేళ్ళు వచ్చేసరికి అతడు మంచం పట్టాడు. మాధవుడు దిగులుపడసాగాడు.

అదే సమయంలో దర్శనుడికి అవసానదశ ఆసన్నమయింది. చనిపోయేముందు తన జ్ఞాన సంపదను అర్హుడికి అందజేయాలనుకుని దివ్యదృష్టితో చూస్తే మాధవుడు కనిపించాడు. ఆయన అప్పటికప్పుడే రంగాపురం వచ్చి మాధవుడితో సంగతి చెప్పి, ''నేను అనేకసంవత్సరాలు కష్టపడి సాధించిన జ్ఞానం నీవశ మౌతుంది. ఆ జ్ఞానంతో నీకు పేరొస్తుంది,'' అన్నాడు.



''నాకు జ్ఞాన సంపద వద్దు. మీకు శక్తే గనక ఉంటేమా తండ్రిని ఆరోగ్యమంతుణ్ణిచేయండి,'' అన్నాడు మాధవుడు. దర్శనుడు నవ్వి, ''నా జ్ఞానం నీ తండ్రి వంటి ఏ ఒక్కరికో కాదు. లోక కల్యాణానికి,'' అన్నాడు.

''మా నాన్న ఆరోగ్యం కుదుట పడేదాకా నా మనసు కుదుట పడదు. మనసు కుదుట పడనిదే నేనే విద్యలూ నేర్వలేను,'' అన్నాడు మాధవుడు.

''అలా అయితే, బదరికారణ్యంలో వైద్య నిధి అయిన మహాభిషుడనే ముని ఉన్నాడు. నువ్వక్కడికి వెళ్ళి ఆయన్ను మెప్పించి, నీ తండ్రి జబ్బును నయం చేసే సంజీవనీ మంత్రం సాధించు,'' అన్నాడు దర్శనుడు.

మాధవుడు వెంటనే బదరికారణ్యం వెళ్ళి మహాభిషుణ్ణిదర్శించి తనను గురించి చెప్పాడు.







ఆ మాట విన్న ముని, ''నీ పితృభక్తిని మెచ్చాను. కానీ సంజీవనీమంత్రాన్ని వశం చేసుకునేం దుకు అవసరమైన కఠోరదీక్ష, ధైర్య సాహసాలు పసివాడివైన నీకు సాధ్యమా అని ఆలోచిస్తు న్నాను,'' అన్నాడు.

''నిస్సంకోచంగా పరీక్షించి చూడండి మహాత్మా,'' అన్నాడు మాధవుడు.

''ఐతే,నెలరోజులపాటు ఈ దీక్ష పాటించు,'' అంటూ ఏం చేయాలో చెప్పాడాయన.

ఆ ప్రకారమే మాధవుడు రోజూ తెల్లవారక ముందే ఎముకలు కొరికే చలిలో చన్నీటి స్నానం చేశాడు. గొడ్డలితో రోజుకు సరిపడా కట్టెలు కొట్టాడు. ఆరు గంటల పాటు విద్యా భ్యాసం చేశాడు. అపక్వాహారం మాత్రమే భుజించాడు. నిద్రపోయే ముందు తండ్రి ఆరోగ్యం కోసం దైవప్రార్థన చేశాడు. అలా నెల్లాళ్ళు గడిచాక మహాభిషుడు వాణ్ణి పిలిచి, ''నీ దీక్షను మెచ్చాను. ఇక ధైర్యసాహసాలు ప్రదర్శించాలి. ఇక్కడికి తూరుపున ఉన్న కొండ గుహలో, కొండ చిలువ ఉన్నది. ఆ గుహ గోడ గూట్లో ఒక వనమూలిక ఉంది. దాన్ని తేవాలి,'' అన్నాడు.

మాధవుడు సరేనని వెళ్ళి, కొండ చిలువ మీదికి దూసుకు వచ్చినా భయపడకుండా గుహ గోడ గూటిలోని మూలికను తెచ్చాడు. ముని వాణ్ణి మెచ్చుకుని మూలికను కమండ లంలో వేశాడు.

నెల్లాళ్ళు గడిచాక, ''అడవి మధ్యలో దయ్యాలమర్రి ఉంది. ఆ చెట్టు తొర్రలో వన మూలిక. అర్ధరాత్రి వెళ్ళి తేవాలి. భయపడ్డావో దయ్యాలకు ఆహారమవుతావు,'' అన్నాడు ముని.

ఆ రాత్రి మాధవుడు దయ్యాలమర్రి వద్దకు వెళ్ళాడు. పన్నెండు దయ్యాలు వికృత రూపాలతో అరుస్తూ వాణ్ణి చుట్టు ముట్టి నాట్యం చేయసాగాయి. వాడు ఏమాత్రం చలించ కుండా వెళ్ళి, చెట్టుతొర్రలోని మూలికను తెచ్చి మునికి అప్పగించాడు. ముని వాణ్ణి మెచ్చుకుని మూలికను కమండలంలో వేశాడు.

మరుసటి నెలలో మాధవుడు మహాభిషుడి మాట మీద వందలాది మొసళ్ళున్న కొలను లోకి దూకి, ధైర్యంగా ఈదుకుంటూ వెళ్ళి కొలను మధ్య తామరాకు మీది మూలికను తెచ్చి ఆయనకు ఇచ్చాడు. ఆయన వాడి ధైర్యాన్నీ, కర్తవ్యదీక్షనూ మెచ్చుకుని మూలి కను కమండలంలో వేశాడు.

మరునాడాయనవాడికిసంజీవనీ మంత్రాన్ని ఉపదేశించి, మూలికలున్న కమండలాన్ని చేతికందించి, ''నువ్వు మంత్రాన్ని ఉచ్చరిస్తూ, ఈ కమండలంలోని జలాన్ని ఎవరిచేత తాగిస్తే, వాళ్ళ సర్వరోగాలూ మాయమై, జీవితాంతం పరిపూర్ణ ఆరోగ్యంతో ఉంటారు,'' అన్నాడు.

మాధవుడాయనకు పాదాభివందనం చేసి బయలుదేర బోతూండగా, ''నాయనా ఈ సంజీవనీ మంత్రాన్ని ఒక్కసారి మాత్రమే ప్రయోగించగలవు. స్వయంకృతాపరాధం వల్ల రోగాలపాలైన నీ తండ్రి వంటి వాడికి దీనిని వాడడం కన్నా, నీవంటి వాడు సేవించ డంలోనే లోకకల్యాణం జరుగుతుంది. ఆపైన నీ ఇష్టం,'' అని హెచ్చరించాడు ముని.

''స్వామీ, దీనిని నా కోసం ఉపయోగిం చడం స్వార్థం. నా తండ్రికి దీని అవసరము న్నది. ఆయన అవసరం తీర్చడం కన్నకొడు కుగా నా బాధ్యత,'' అన్నాడు మాధవుడు.

మహాభిషుడు మందహాసంతో, ''మనోభీష్ట సిద్ధిరస్తు,'' అని దీవించి సాగనంపాడు.

మార్గమధ్యంలో వాడికి దర్శనుడు ఎదురై, జరిగినదంతా విని, ''నువ్వు కారణజన్ముడివి. కాబట్టే అనన్య సాధ్యమైన సంజీవనీ మంత్రం నీ వశమయింది. ఐతే, రేపటి సూర్యోదయమే నా అంత్య కాలం. ఈ లోగా వీలైనంత జ్ఞానాన్ని నా నుంచి స్వీకరించి వెళ్ళు,'' అన్నాడు.

మాధవుడు సరే నన్నాడు. ఇద్దరూ సమీ పంలో ఉన్న కొలను ఒడ్డున కూర్చున్నారు. దర్శనుడు జ్ఞానోపదేశం చేస్తున్నాడు. మాధ వుడు వింటున్నాడు. చీకటి పడింది. అర్ధరాత్రి



అయింది. మాధవుడు ఉన్నట్టుండి, ''గురు వర్యా, మీ నుంచి పూర్తి జ్ఞానాన్ని పొందాలి. మీ ఆయువు పొడిగించడానికి ఏమైనా మార్గ ముంటే చెప్పండి,'' అన్నాడు.

దర్శనుడు భారంగా నిట్టూర్చి, ''నువ్వు నేర్చిన సంజీవనీ మంత్రంతో నా ఆయువును మరో పది సంవత్సరాలు పొడిగించవచ్చు. కానీ ఏం లాభం? దాన్ని నువ్వు నీ తండ్రి కోసం ఉద్దేశించావు కదా!'' అన్నాడు.

మాధవుడు తక్షణమే దర్శనుడిపై సంజీ వని ప్రయోగించాడు. ఆయన సంతోషించి మాధవుడికి వారం రోజుల పాటు జ్ఞానోపదేశం చేసి దీవించి తన దారిన వెళ్ళాడు. మాధవుడు ఇంటికి వెళ్ళేసరికి రాఘవయ్య సంపూర్ణా రోగ్యంతో ఎదురు వచ్చి కొడుకును ఆప్యా యంగా కౌగిలించుకున్నాడు. మాధవుడు



మొదట ఆశ్చర్యపోయినా, ఆ తరవాత మనసు లోనే మునికి కృతజ్ఞతలు చెప్పుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మాధ వుడు సంజీవనిని నువ్వే సేవించడం శ్రేయ స్కరమని మహాభిషుడన్నప్పుడు స్వార్థమని నిరసించాడు. అయితే, ఆ తరవాత దానిని తన జ్ఞాన సముపార్జన కోసం దర్శనుడిపై ప్రయో గించాడు. అది స్వార్థం కాదా? లోకకల్యాణం కోసమే పాటు పడుతున్నానని చెప్పుకున్న దర్శనుడు, తన ఆయువును పెంచుకోవడానికి మాధవుణ్ణి తెలివిగా ఉపయోగించుకోవడం స్వార్థానికి పరాకాష్ఠకాక మరేమిటి? సంజీవనీ ప్రయోగం జరగక పోయినా, రాఘవయ్య ఆరోగ్యవంతుడు కావడానికి కారణం ఏమిటి? ఈ సందేహాలకు సమాధానం తెలిసీ చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సంజీవనిని స్వప్రయోజనం కోసం ఉయోగించనని మాధ వుడు చెప్పిన మాట వాస్తవమే. ఆ మాటను అతడు చివరిదాకా పాటించాడు. దర్శనుడి జ్ఞానోపదేశం ఫలితంగా-సంజీవని లోక కల్యాణం కోసం ఉద్దేశింప బడిన గొప్ప మంత్రం అనీ, దాన్ని కేవలం తన తండ్రి కోసం మాత్రమే ఉపయోగించడం స్వార్థం కాగల దనీ అతడు గ్రహించాడు. తన తండ్రికి జబ్బు నయం కావడంకన్నా దర్శనుడివంటి సాధువు మరో పదిసంవత్సరాలు జీవించడంలోనే లోక కల్యాణం ఉందని అతడు తెలుసుకుని, దానిని దర్శనుడిపై ప్రయోగించాడు. అందు వల్ల అది స్వార్థంకాదు. ఇక లోకకల్యాణం కోసమే జీవిస్తూ, తన మరణానంతరం కూడా తన జ్ఞానం లోకానికి ఉపయోగపడాలను కున్న దర్శనుడి వంటి ఉన్నతమైన సాధువుకు స్వార్థం ఆపాదించడం భావ్యం కాదు. రాఘ వయ్య ఆరోగ్యవంతుడు కావడానికి ప్రధాన కారణం ఆయన భార్య పాతివ్రత్య మహిమ. ఆమె భక్తితో చేసిన వ్రతాల ఫలం. దానికి తోడు తపోసంపన్నుడైన మహాభిషుడు మాధవుణ్ణి, 'మనోభీష్టసిద్ధిరస్తు' అని ఆశీర్వదించడం కూడా ఒక కారణం!" అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. - (కల్పితం)

[ఆధారం : "వసుంధర" రచన]






## వేప-చల్లదనం




మనదేశానికి చెందిన వేపచెట్టు చాలా ప్రత్యేకమైనది. వేళ్ళ నుంచి ఆకుల వరకు ఈ చెట్టు ప్రతిభాగమూ ఉపయోగపడుతున్నది. వేపాకులకు ఔషధ గుణాలే కాకుండా వాతావరణంలోని వేడిని పది డిగ్రీల వరకు చల్లబరచే శక్తి ఉన్నదని చెబుతారు. ఇవి క్రిమిసంహార కాలుగానూ పని చేస్తాయి. వేపచెట్టు భాగాలను ఔషధాలు, అలంకరణ వస్తువులు తయారు చేయడానికీ, ఇంటికి ఉపయోగ కరమైన ఇతర వస్తువులను తయారుచేయడానికి వేప కొయ్యను ఉపయోగిస్తారు. ఆస్ట్రేలియా, వియత్నాం వంటి దేశాలు వేప మొక్కలను నాటి పెంచుతున్నాయి. వేపచెట్లను రక్షించి కాపాడుకోకపోతే, ప్రపంచం వేప అవసరాలకు ఇతర దేశాల మీదే ఆధారపడవలసి రావచ్చునని ఇటీవల జరిగిన ఒక సదస్సులో పాల్గొన్న విజ్ఞాన వేత్తలు మనదేశాన్ని హెచ్చరించారు.

## జాతీయ నిధి!



జమ్మూ-కాశ్మీరు రాష్ట్రంలో వివిధ భాష లలో సాహిత్యం, చరిత్ర, భూగోళం, మతం, తంత్రం, జ్యోతిషం, వైద్యం మొదలైన విషయాలకు సంబంధించిన దాదాపు 16,000 వ్రాతప్రతులు ఉన్నాయి. కొండరావి చెట్టు బెరడు మీద చెక్కిన గిల్గిట్ లిపిలోని వ్రాతప్రతులను చాలా అమూల్యమైనవిగా భావిస్తున్నారు. క్రీ.శ. 5వ లేదా 6వ శతాబ్దానికి చెందినవిగా వీటిని భావిస్తున్నారు. ప్రపంచంలోనే అత్యంత ప్రాచీనమైనవిగా భావించబడే ఈ గిల్గిట్ వ్రాతప్రతులను జమ్మూకాశ్మీరులోని పురావస్తు శాఖ, వస్తుప్రదర్శనశాల జాగ్రత్త పరిచి కాపాడుతున్నాయి. వీటిని ఇప్పుడు 'జాతీయనిధి'గా ప్రకటించారు.







# పర్వతరాజు-పర్వతరాణి

మహేంద్రగిరి రాజ్యంలో ఎక్కడ విన్నా ఒకే మాట. ఎటు తిరిగినా అదేమాట. నిన్నటి వరకు విడివిడిగా ఉన్న రెండు కొండలు, తెల్ల వారే సరికి ఎలా ఒకటయ్యాయని ప్రజలు గుంపులు గుంపులుగా చేరి అబ్బురంగా మాట్లాడుకోసాగారు.

ఈ సంచలన వార్త చెవినపడగానే మహా రాజు ఇంద్రసేనుడు ఆ వింతను చూడడానికి స్వయంగా అక్కడికి బయలుదేరాడు.

రాజ్యానికి దక్షిణ దిశలో ఎడమవైపున సుగంధగిరి, కుడివైపున సుగంభీరగిరి అనే రెండు కొండలు ఉండేవి. రెండు కొండల నుంచీ, వెండి తీగల్లా జారే రెండు జలపాతాలు నేల మీద ఒకటిగా కలిసి చిన్న నదిలా కొండ లను వేరు చేస్తూ ఉత్తరాభిముఖంగా ప్రవహిం చేవి. ఇప్పుడు హఠాత్తుగా ఆ రెండు కొండలూ ఒకటి కావడంతో రెండు జలపాతాలూ ఒక టిగా కలిసిపోయి మరింత పెద్ద పాయగా మారి ఉరుకుతున్నాయి. నదీ ప్రవాహం మరింత ఉధృతంగా తూర్పుదిశకేసి గలగలా సాగుతున్నది.

జలపాతం పక్కన ఒక దివ్యపురుషుడు విహరిస్తూండడం చూసిన రాజు ఆయనకు భక్తితో నమస్కరించాడు.

''ఇంద్రసేన మహారాజు ఒంటరిగా ఇలా రావడం ఆశ్చర్యంగా ఉంది,'' అన్నాడు దివ్య పురుషుడు.

''నిన్నటి వరకు విడి విడిగా ఉన్న గిరి శిఖరాలు హఠాత్తుగా ఒకటి కావడం అంత కన్నా ఆశ్చర్యం కదా! ఈ గిరిశిఖరాలు రెండూ ఒకటిగా కలిసిపోవడానికి గల కారణం దివ్య పురుషులైన తమకు తప్పక తెలిసివుంటుంది.

ఎన్. శివనాగేశ్వరరావు

ఆ సంగతి వివరిస్తారా,'' అని వేడుకున్నాడు రాజు వినయంగా.

''తప్పకచెబుతాను,'' అంటూ దివ్యపురుషుడు ఇలా చెప్పసాగాడు:

సుగంధపుష్పాలతో, ఫల వృక్షాలతో సుందరంగా ఉండే సుగంధగిరి మీద పర్వతరాణి నివాస ముండేది. ఆమె దేవతలకు తప్ప మనుషులకు కనిపించేది కాదు.

ఆ పర్వతంపైన చాలా చల్లగా ఉండేది. అందువల్ల వేసవి కాలంలో ఆ పర్వతం యాత్రికులతో చాలా సందడిగా ఉండేది. ఆ సమయంలో పర్వత రాణి అదృశ్యంగా అటూ ఇటూ తిరుగుతూ, యాత్రికులందరికీ ఎలాంటి కొరతా లేకుండా చూసుకునేది. అంతే కాదు. తన వద్దకు వచ్చిన వారందరూ క్షేమంగా, సుఖసంతోషాలతో తిరిగి వెళ్ళాలని భగవంతుణ్ణి ప్రార్థించేది.

సుగంధగిరి పక్కనే సుగంభీరగిరి ఉండేది. అక్కడక్కడ పెద్ద పెద్ద బండలు కనిపించినప్పటికీ అది కూడా పుష్ప ఫల వృక్షాలతో, జలపాతాలతో చూడడానికి అందంగానే ఉండేది. అయినా ఎప్పుడుగాని, ఏఒక్కరూ అక్కడికి వెళ్ళేవారు కారు. ఆ పర్వత శిఖరాన నివసిస్తూన్న పర్వత రాజుకు ఇదెంతో అసంతృప్తిని కలిగించేది. పక్కనే ఉన్న సుగంధగిరికి ప్రజలెందుకు తరచూ తండోప తండాలుగా వెళతారో, తన కొండ మీదికి ఒక్కరు కూడా



ఎందుకు రారో పర్వతరాజుకు అర్థమయ్యేది కాదు. సుగంధగిరి మీదికి సంతోషంగా వచ్చే పోయేవారిని పర్వతరాజు అప్పుడప్పుడు తన కొండపై కూర్చుని చాలా దిగులుగా చూస్తూండేవాడు.

అలా ఒక వైశాఖపూర్ణిమనాడు సుగంధగిరి యాత్రికులతో కళకళలాడుతోంది. ఎప్పటిలాగే పర్వతరాణి ఉత్సాహంగా అటూ ఇటూ తిరుగుతూ యాత్రికులకు ఎలాంటి కొరతా రాకుండా అపురూపంగా చూసుకోసాగింది. పిల్లలు, పెద్దలు; స్త్రీలు, పురుషులు అందరూ తన పర్వతం అందచందాలను పొగుడుతూ ఉంటే విని మురిసిపోయింది. ఆమె ఆనంద పరవశంతో చేతులు మోడ్చి ఆకాశం వంక



చూస్తూ, ''నా వద్దకు వచ్చే ప్రజలందరూ ఇప్పటిలాగే ఎప్పుడూ సుఖసంతోషాలతో వర్ధిల్లాలి!'' అని భగవంతుణ్ణి మనసారా ప్రార్థించింది.

అదే సమయంలో ప్రకృతి అందాలను చూసి మైమరచిన ఒక యాత్రికుడు కాలు జారి కిందవున్న ఒకఅగాథంలోకిపడిపోయాడు. అతడి భార్యాబిడ్డలు ఆక్రందనలు చేశారు. పర్వతరాణి అతణ్ణి రక్షించడానికి చేయి సాచిందిగానీ, అంతలోనే అతడు ఆమె రక్షణరేఖను దాటిపోయాడు. తన వద్దకు వచ్చిన యాత్రికుడికి ప్రమాదం వాటిల్లినందుకు పర్వతరాణి నేత్రాలు బాష్పపూరితాలయ్యాయి.

సుగంభీరగిరిపై కూర్చుని ఇదంతా చూస్తున్న పర్వతరాజు, తన మహిమతో రెండు చేతులను మెత్తటి పరుపుగా మార్చి, యాత్రికుణ్ణి పట్టుకుని సురక్షితంగా సుగంధగిరి మీదికి చేర్చాడు.

తాను ఎలా బతికిందీ యాత్రికుడికి తెలియలేదు. అందరూ భక్తితో పర్వతానికి సాగిలపడి మొక్కారు.

యాత్రికుణ్ణి ప్రాణాపాయం నుంచి కాపాడిన పర్వతరాజుకు, పర్వతరాణి కృతజ్ఞతలు చెప్పింది. అప్పుడు పర్వతరాజు, ''నేనే నీకు కృతజ్ఞతలు చెప్పాలి. ఇన్నాళ్ళు, యాత్రికులు నీ వద్దకు మాత్రం ఎందుకు వస్తారు? నా వద్దకు ఎందుకు రారు? అని అసూయపడే వాణ్ణి. అయితే, అసలు సంగతి ఇప్పుడు గ్రహించాను. నువ్వు నీ దగ్గరికి వచ్చే వాళ్ళందరూ బాగుండాలని కోరుకుంటావు. భగవంతుణ్ణి ప్రార్థిస్తావు. నీ మంచి మనసు కారణంగా నీ వద్దకు వచ్చే వారందరూ సంతోషం అనుభవించగలుగుతున్నారు. నేను నా వద్దకు వచ్చే వారిని గురించి ఆలోచించను, పట్టించుకోను. అందువల్ల నా పర్వతం మీది ప్రకృతి శోభ ఇన్నాళ్ళు లోభివాడి సంపదలా నిరుపయోగంగా ఉండిపోయింది,'' అన్నాడు.

ఆ మాట విన్న పర్వతరాణి, ''మంచి మనసున్న వారే మంచిని గ్రహించగలుగుతారు. ఈ రోజు ఒక నిండు ప్రాణాలను





కాపాడిన నీ సాయం మరువరానిది. ఏదైనా కోరుకో. నీ కోరిక మన్నిస్తాను,'' అన్నది.

అప్పుడు పర్వతరాజు మందహాసం చేస్తూ, ''నీకు అభ్యంతరం లేకుంటే బంగారం లాంటి మనసున్న నిన్ను వివాహమాడాలని ఉన్నది,'' అన్నాడు.

పర్వతరాణి సిగ్గుతో తలవంచుకుని, ''నీవంటి మనోహరుడు వివాహమాడతానంటే ఎవరు కాదనగలరు?'' అన్నది.

ఒక శుభముహూర్తాన దేవతల సమక్షంలో పర్వతరాజు, పర్వతరాణిని వివాహమాడాడు. వివాహం జరిగిన మరుక్షణమే సుగంధగిరి, సుగంభీరగిరి రెండూ ఒకటిగా కలిసి ఒకే మహాపర్వతంగా ఏర్పడ్డాయి. ఆ రెండు పర్వతాల కలయికతో అంతకు ముందులేని అందమైన పుష్పాలు, కొత్త కొత్త ఫలవృక్షాలు, మహా జలపాతాలు ఏర్పడ్డాయి.

రెండు చిన్న పర్వతాలు ఒకటై మహా పర్వతం ఏర్పడిన ఉదంతాన్ని వివరించిన దివ్యపురుషుడు, ''పర్వత రాజునూ, రాణినీ ఆశీర్వదించాలని వారి వివాహానికి విచ్చేసిన నేను, ప్రకృతి అందాలను తిలకిస్తూ ఇక్కడే ఉండిపోయాను. నాతో వచ్చిన వారందరూ ఎప్పుడో వారివారి లోకాలకు తిరిగి వెళ్ళిపోయారు. నేనూ బయలుదేరుతున్నాను. ఈ సందర్భంగా నీకు ఒక ముఖ్యమైన ప్రకృతి రహస్యం చెప్పాలి. మానవులకులాగే చెట్టూ చేమలకు, కొండా కోనలకు సైతం ప్రాణంతో పాటు భావోద్వేగాలు ఉంటాయి. వాటిని గౌరవిస్తూ, ప్రకృతికి అనుగుణంగా తమ జీవనవిధానాలను ఏర్పరచుకునే మానవులు ఈ భూమిమీద సుఖసంతోషాలతో చిరకాలం వర్ధిల్లగలరు. శుభవస్తు,'' అంటూ అదృశ్యమయ్యాడు.

ఇంద్రసేన మహారాజు ఆ మహాపర్వత గాంభీర్యాన్నీ, అక్కడి మనోహర సుందర ప్రకృతి దృశ్యాలనూ చూస్తూ కొంతసేపు గడిపి, పరమానందంతో రాజధానికి తిరుగు ప్రయాణమయ్యాడు. శ్రీ సుగంధ మహాపర్వత పాదతలంలో యేటా వైశాఖ పూర్ణిమనాడు ఘనంగా వేడుకలు ఏర్పాటు చేయాలని నిర్ణయించాడు.





## ముస్లిం పూజారి

విశాఖపట్నం సమీపంలో ఉన్న ఒక గ్రామంలోని కాళీ ఆలయా నికి షేక్ మీరాన్ సాహెబ్ అనే ఒక ముస్లిం, పూజారిగా ఉంటు న్నాడు. అతడు అచ్చమైన వైదిక సంప్రదాయంలో పూజలు నిర్వహిస్తాడు. సుబ్రహ్మణ్య శాస్త్రి అనే పురోహితుడి వద్ద మంత్రాలు చెప్పడం నేర్చుకున్నాడు. జందెం కూడా వేసుకుం టాడు. అదే సమయంలో అతడు దగ్గరున్న మసీదుకు కూడా వెళ్ళి భక్తితో నమాజు చేస్తాడు. అతడు చేపట్టిన వృత్తిని స్థానిక ముస్లింలు అనుమతించారు. రోజూ గుడికి వచ్చే భక్తులు చెల్లించే కానుకలతో జీవితం సాగిస్తున్నాడు. మీరాన్ సాహెబ్ చిన్నప్పుడు పశువులు మేపేవాడు. ఒకనాడు ఒక దేవీ విగ్రహాన్ని చూశాడు. ఆ రోజు రాత్రే, తనకు గుడికట్టించమని దేవి కలలో కనిపించి అతన్ని ఆజ్ఞాపించిందట!

## భూమి మీద, అంతరిక్షంలో మారథాన్ పరుగు పందెం!

గత ఏప్రిల్ నెలలో నిర్వహించిన బోస్టన్ మారథాన్ పరుగు పందెంలో దాదాపు 24,000 మంది పాల్గొన్నారు. వారిలో ఒక సోదరి దీనా పాండ్య భూమి మీద పాల్గొంటే, మరొక సోదరి సునీతా విలియమ్స్ అంతరిక్షం నుంచి పాల్గొన్నది. అయితే, సునీత హాప్‌కింటన్ ప్రారంభ రేఖ దగ్గరికి రాలేక పోయింది. భూమికి 338 కి.మీ. ఎత్తున వున్న ఇంటర్నేషనల్ పవర్ స్టేషన్‌లో అమర్చిన ట్రెడ్‌మిల్ మీద 'పరిగెత్తింది'. 4 గంటలా 24 నిమిషాల్లో ఆమె 42.2 కి.మీ. దూరం 'పరిగెత్త' గలిగింది. అంతరిక్షం నుంచి 'బోస్టెన్ ఈవెంట్'లో పాల్గొన్న తొలి వ్యక్తి ఆమె. మరో విషయం ఏమంటే-సునీత అనుకున్న దానికన్నా ఎక్కువ రోజులు ఇంటర్నేషనల్ స్పేస్ స్టేషన్‌లో ఉండవలసి వస్తున్నది. స్పేస్ షటిల్ అట్లాంటిస్ 'ఫ్యూయల్ ట్యాంక్'ను 'హెయిల్‌స్టార్మ్' దెబ్బతీయడంవల్ల అనుకున్న జూన్ 28వ తేదీ లాంఛింగ్ ఆలస్యం కావచ్చు. అయినప్పటికీ, ప్రస్తుతం ఆమెను అంతకు ముందే వేరొక టీమ్ 'పిక్ అప్' చేయగలదని చెబుతు న్నారు. సెప్టెంబర్ నెలలో హైదరాబాదులో జరుగనున్న అంత ర్జాతీయ అంతరిక్ష శాస్త్రవేత్తల మహాసభలో సునీత పాల్గొననున్నది అని కూడా చెబుతున్నారు.





## హర్యానా జానపద కథ

# నీలంరంగు పువ్వుల అడవి

చిన్నప్పుడే తల్లిదండ్రులు చనిపోవడంతో పరమానందుడు ఒంటరి జీవితం గడుపుతున్నాడు. అతనికి పూలచెట్లన్నా, పక్షులన్నా ఎంతో ఇష్టం. అందువల్ల ఒక అడవి సమీపంలో తన నివాసం ఏర్పరచుకున్నాడు. అతడు అక్కడ లభించే ఫలాలనూ, కందమూలాలనూ తిని కడుపు నింపుకునేవాడు. అరుదుగా ఎప్పుడో ఒకప్పుడు పక్షులను పట్టుకునేవాడు.

అలా ఒకనాడు అతడు పక్షులకు వల విసిరాడు. వలలో ఒక అందమైన అడవిచిలుక పట్టుబడింది. అతడు దానిని బయటకు తీసి ఈకలు పీకడానికి ప్రయత్నిస్తూ, "నువ్వు నన్ను చంపొద్దు. మరెవ్వరికీ అమ్మవద్దు. నీకు అదృష్టం కలుగుతుంది," అన్న చిలుక మాటలువిని విస్తుపోయాడు.

"అలాగే. నిన్ను ప్రాణాలతో వదిలితే నాకు ఎలాంటి అదృష్టం కలిగేలా చేస్తావు? చెప్పు మరి," అని అడిగాడు పరమానందుడు.

"నన్ను రాజు వద్దకు తీసుకువెళ్ళు. నీకే తెలుస్తుంది," అన్నది చిలుక.

పరమానందుడు అప్పటికప్పుడే రాజభవనం కేసి బయలుదేరాడు. ఆ పక్షిని చూడగానే రాజు, "ఆహా, ఎంత అందమైన పక్షి!" అని ఆశ్చర్యపోయాడు. తన కుమార్తె మోతీరాణిని పిలుచుకు రమ్మని భటుణ్ణిపంపాడు. ఆమెరాగానే, "చూశావా ఈ చిలుక ఎంత అందంగా ఉందో!" అన్నాడు.

"అవును, చాలా అందంగా ఉంది. దాన్ని నాకు ఇప్పిస్తే చాలా జాగ్రత్తగా పెంచుకుంటాను," అన్నది రాకుమారి.

రాజు పరమానందుడికేసి తిరిగి, "ఆ పక్షి మాకు కావాలి. నువ్వు దానికి ఎంత పుచ్చుకుంటావు?" అని అడిగాడు.

యువరాణి అందచందాలను దిగ్భ్రాంతితో చూస్తున్న పరమానందుడు రాజు ప్రశ్నకు వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. చిలుక దాన్ని అవకాశంగా తీసుకుని, "వెయ్యి నాణాలు!" అన్నది.

చిలుక మాటవిని సభలోని వారందరూ సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యారు. రాజు వెంటనే వెయ్యి బంగారు నాణాలు తెప్పించి, పర





యువరాణికిచ్చి, ఇచ్చిన మాటను నిలబెట్టు కున్నది. ఆ పువ్వును చూసి రాజకుమారి పరమానందం చెందింది. అంతటితో ఊరుకోకుండా అందమైన ఆ పువ్వుల గుత్తును తెచ్చిన వారినే వివాహ మాడాలనుకున్నది.

కుమార్తె నిర్ణయం విని రాజు దిగ్భ్రాంతి చెందాడు. వెంటనే ఆయన ఆమె వద్దకు వెళ్ళి, "నిన్ను వివాహ మాడడానికి ఇప్పటికే ఎందరో రాజకుమారులు వచ్చారు. అందరూ కూడా ధైర్యసాహసాలుగల అందమైన యువకులే. ఎవరో ఒక వేటగాడు అడవిలో ఈ పువ్వులను చూసి, ఒక గుత్తును తీసుకు వచ్చాడే అనుకుందాం. అలాంటి వాణ్ణి నువ్వు వివాహ మాడగలవా? నిన్ను వివాహమాడే వాడే మునుముందు మన రాజ్యానికి రాజు కూడా అవుతాడు. ఆలోచించి చూడు," అన్నాడు.

అయితే, రాకుమారి అంత సులభంగా తన మనసు మార్చుకునేలా కనిపించలేదు. దాంతో రాజు, ఏ రాజకుమారుడైనా, అడవిలో అలాంటి పువ్వును కనుగొని తీసుకురాగలడన్న నమ్మకంతో యువరాణి నిర్ణయాన్ని చాటింపు వేయించాడు. ఆ చాటింపు విని పలువురు రాకుమారులు నీలంరంగు పువ్వును వెతుక్కుంటూ వెళ్ళి అడవులన్నీ గాలించారు. కాని ప్రయోజనం లేకపోయింది.

పరమానందుడు కూడా యువరాణి నిర్ణయం గురించి విన్నాడు. అద్భుత సౌందర్యరాశి అయిన యువరాణిని చూసిన క్షణం నుంచి అతడి మనసంతా ఆమె మీదే ఉన్నది. ఎలాగైనా ఆమెను వివాహమాడగలనని కలలుగనసాగాడు. ఇప్పుడు రాకుమారి చాటింపు గురించి తెలియగానే అతడి కోరిక మరింత బలపడసాగింది. ఇంతకూ ఆ విచిత్ర పుష్పాన్ని తీసుకుపోయి రాజకుమారికి ఇచ్చింది తన చిలుకే అని తెలియడంతో మరింత

మానందుడికి అందించాడు. పరమానందుడు సంతోషంగా అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. రాజు, ఆయన కుమార్తె కొంతసేపు చిలుక పలుకులు వింటూ ఆనందించారు. ఆ పిమ్మట, రాజకుమారి చిలుకను అంతఃపురంలోకి తీసుకు వెళ్ళింది. మరునాడే చిలుక కోసం ఒక బంగారు పంజరం తయారు చేయించింది.

కొన్ని రోజులు గడిచాయి. ఒకనాడు, "నాకు మా ఇంటి మీద ధ్యాస మళ్ళింది. ఒక్కసారి వెళ్ళి చూసి రావాలని ఉంది. తమరు అనుమతించారంటే వెళ్ళి తప్పకుండా తిరిగి వస్తాను. వచ్చేప్పుడు మీకొక మంచి కానుక కూడా తీసుకువస్తాను," అని చిలుక రాకుమారిని వేడుకున్నది.

రాకుమారి అందుకు అయిష్టంగానే అంగీకరించింది.

చిలుక వెంటనే ఎగిరివెళ్ళి, కొన్ని వారాల తరవాత తిరిగివచ్చింది. వస్తూ వస్తూ ఒక అందమైన నీలంపువ్వును ముక్కున కరుచుకుని వచ్చి



ఉత్సాహం కలిగింది. అతడికి అడవులన్నిటి గురించీ క్షుణ్ణంగా తెలుసు. అందువల్ల ఒకనాడు నీలం పువ్వు చెట్టును వెతుక్కుంటూ బయలుదేరాడు.

పొలాలూ, మైదానాలూ, నదులూ, కొండలూ, కోనలూ దాటుకుంటూ అనేక రోజులు ప్రయాణం చేసి, ఒకనాడు ఒకానొక కొండశిఖరాన్ని చేరుకున్నాడు. అక్కడి నుంచి అవతలి వైపుకు చూస్తే నీలిపువ్వుల సుందర వనం కనిపించింది. అతడు వేగవేగంగా కొండదిగి ఆ అడవిని సమీపించాడు.

అడవి చాలా అందంగా కనిపించింది. అక్కడి నుంచి పూలగుత్తును కోసుకుపోవడమా? లేక ఒక చెట్టునే పెకలించుకుని వెళితే బావుంటుందా? అందుకు ఎవరి అనుమతినైనా తీసుకోవాలా? అని ఆలోచిస్తూండగా పరమానందుడికి గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. అతడు వెంటనే ఒక చెట్టు చాటుకు వెళ్ళి దాక్కున్నాడు.

గుర్రం మీద వచ్చిన ఒక యువకుడు, గుర్రం పైనుంచి దిగి మెల్లగా వెళ్ళి ఒక చెట్టు నీడలో విచారంగా కూర్చున్నాడు. పరమానందుడు ఆ యువకుణ్ణి సమీపించి, ''ఈ అడవి ఏరాజ్యం సరిహద్దులోపల ఉందో తెలుసా?'' అని అడిగాడు. ఆ మాట విని తలెత్తి చూసిన యువకుడు, ''ఇది శ్యామ పుష్ప రాజ్యం. నువ్వెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చావు?'' అని అడిగాడు.

''నా పేరు పరమానందుడు. నీలం రంగు విచిత్ర పుష్పాన్ని వెతుక్కుంటూ వచ్చి, ఈ వనం చేరాను. అది సరే, నువ్వు అంత విచారంగా ఉన్నావెందుకు మిత్రమా?'' అని అడిగాడు పరమానందుడు ఆ యువకుడి పక్కనే కూర్చుంటూ.

''అదొక పెద్ద కథ!'' అంటూ గాఢంగా నిట్టూర్చాడు యువకుడు.

''చెప్పు, వింటాను,'' అన్నాడు పరమానందుడు.

''ఈ రాజ్యాన్నేలే రాజుకు అద్భుత సౌందర్యవతి అయిన ఒక కుమార్తె ఉండేది. ఆమె పేరు నీలమణి. సుకుమారి అయిన ఆమె ఇక్కడికి రాగానే పక్షులు పాడేవి. ఆమె తాకగానే మొగ్గలు పూచేవి. మా తండ్రి రాజుగారి ప్రధాన మంత్రిగా ఉండేవారు. చిన్నప్పుడు నేనూ, నీలమణీ కలిసి ఆడుకునే వాళ్ళం. పెరిగి పెద్దయ్యాక పెళ్ళి చేసుకోవాలని ఆశించాం. అయితే, రాజుగారు తన కుమార్తెను ఒక ధనిక వర్తకుడికిచ్చి వివాహం చేయాలని అనుకున్నాడు. అయితే, బాల్య మిత్రుడైన నన్ను తప్ప మరెవ్వరినీ వివాహమాడనని నీలమణి తండ్రికి చెప్పింది.

రాజుగారికి ఆగ్రహం కలిగింది. అదే సమయంలో ఒక మాంత్రికుడు రాజ దర్శనానికి వచ్చాడు. యువరాణి శరీరానికి బంగారపు రంగు తెప్పిస్తానని చెప్పి, అతడు ఆమెను మంటల మధ్య కూర్చోబెట్టాడు. మంటలు ఎగిసి పడుతూండగా ఆమెను ఒక బంగారపు మేకుగా





మార్చి, "ఈ మేకును అగ్నిలో కాల్చినట్టయితే నీ కుమార్తె మళ్ళీ యథారూపంలో వస్తుంది," అని చెప్పి మాంత్రికుడు వెళ్ళిపోయాడు.

"బంగారం మేకు ఏమయింది?" అని అడిగాడు పరమానందుడు ఆతృతగా.

"రాజు ఆగ్రహావేశంతో ఆ మేకును తెచ్చి, ఇక్కడున్న చెట్లలో ఒక దానికి కొట్టి మరీ వెళ్ళాడు. రాజభవనంలోని నీలవేణి చెలికత్తె ద్వారా నాకీ సంగతి తెలియవచ్చింది. ఆనాటి నుంచి నేను రోజూ ఇక్కడికి వస్తున్నాను. మేకు దించిన చెట్టు కోసం వెతుకుతూనే ఉన్నాను. ఇంత వరకు కనుగొనలేక పోతున్నాను. రాజుగారు కూడా ప్రస్తుతం చేసిన పనికి పశ్చాత్తాప పడుతున్నట్టు చెబుతున్నారు. ఆ మేకును కనుగొన్నట్టయితే, నేను దానిని ఆయన వద్దకు తీసుకువెళ్ళి, ఆమెకు పూర్వరూపం తెప్పించగలను. అప్పుడాయన తన కుమార్తెను నాతో వివాహం జరిపించడానికి తప్పక అంగీకరించగలడు," అన్నాడు యువకుడు.

"ఆ చెట్టునూ, మేకునూ కనుగొనడానికి నేను నీకు సాయపడగలను," అన్నాడు పరమానందుడు.

"ఎలా సాయపడగలవు? ఒక్క చెట్టును వదలకుండా అన్ని చెట్లనూ నేను వెతికాను. ఇంతవరకు కనుగొనలేక పోయాను," అన్నాడు యువకుడు నిస్పృహతో.

"రాత్రి సమయంలో ఇక్కడికి వద్దాం," అన్నాడు పరమానందుడు.

"అద్భుతమైన ఆలోచన! నాకు ఇంతవరకు తోచనే లేదు. ఇప్పటికి వెళదాం, రా," అంటూ ఉత్సాహంగా లేచి నిలబడ్డాడు యువకుడు.

ఇద్దరూ గుర్రంమీద ఆ యువకుడి ఇల్లు చేరారు. సాయంకాలం కాగానే మళ్ళీ ఇద్దరూ అడవికి బయలుదేరారు. బయలుదేరే ముందు యువకుడు ఒక కత్తిని తీసుకున్నాడు. చీకటి అలముకుంటూండగా ఇద్దరూ ఒక్కొక్క చెట్టు బోదెనూ పరిశీలనగా చూస్తూ వెతక సాగారు. ఉన్నట్టుండి, "మిత్రమా, అదిగో అటు చూడు! వెన్నెలకు ఏదో మెరుస్తున్నది. బహుశా అదే మేకు కావచ్చు," అంటూ పరమానందుడు ఒక చెట్టు కేసి చూపాడు.



మంత్రికొడుకు కత్తిని తీసుకుని ఆ చెట్టు వద్దకు వెళ్ళి, మెరుస్తూన్న వస్తువు చుట్టూ చెక్కాడు. మేకు స్పష్టంగా కనపడసాగింది. అతడు దానిని జాగ్రత్తగా బయటకు లాగాడు. బంగారు మేకు మునుపటిలాగే నిగనిగలాడుతూ కనిపించింది. ''రా, రేపు ఉదయం రాజును దర్శించి ఈ మేకును అప్పగిద్దాం,'' అంటూ మంత్రికుమారుడు దానిని దుస్తులలో భద్ర పరుచుకుని అక్కడి నుంచి బయలుదేరాడు.

మరునాడు ఇద్దరు మిత్రులూ కలిసి రాజ దర్శనానికి వెళ్ళారు. మంత్రి కుమారుడు తెచ్చి ఇచ్చిన బంగారు మేకును చూడగానే రాజుగారి ఆనందానికి ఎల్లలు లేకుండా పోయాయి. ఆ మేకును కనుగొనడంలో తనకు సాయపడిన పరమానందుణ్ణి గురించి మంత్రి కొడుకు రాజుకు తెలియజేశాడు. రాజు యజ్ఞ గుండాన్ని రగిలించ మని చెప్పి, మంటలు రాగానే రాజు స్వయంగా బంగారు మేకును ఆతృతతో అగ్నిలోకి వేశాడు. మంటలు ఆరే వరకు ఎలాంటి చలనమూ, మార్పూ కనిపించలేదు. మంటలు చల్లారి బొగ్గులు, బూడిద మాత్రమే మిగిలాయి. అందరూ ఉత్కం ఠతతో చూస్తూండగా ఉన్నట్టుండి, బూడిదరాసి నుంచి మునుపటిలాగే రాకుమారి నీలమణి లేచి నిలబడింది. చిరునవ్వుతో ముందుకు సాచిన తండ్రి చేయిని పట్టుకుని బంగారు బొమ్మలా వెలుపలికి వచ్చింది.

మరుక్షణమే రాజు, మంత్రి కుమారు డితో తన కుమార్తె వివాహం జరుగు తుందని ప్రకటించాడు. ఆ తరవాత ఆయన పరమానందుడి కేసి తిరిగి, ''నీకు ఎలాంటి బహుమతి కావాలి మిత్రమా?'' అని అడిగాడు.

అప్పుడు పరమానందుడు తను నీలం రంగు పుష్పం కోసం వచ్చిన విషయం చెప్పాడు. అంతా విన్న రాజు, ''ఒక గుత్తు పుష్పాలెందుకు? ఒక చెట్టునే పెకలించుకుని వెళ్ళి, మీ రాజుగారి ఉద్యానవనంలో నాటించు. యువరాణి ఆనందించి నిన్ను భర్తగా స్వీకరిస్తుంది,'' అన్నాడు చిన్నగా నవ్వుతూ.

అదే విధంగా ఆ రాజ్యపు భటులు వెంట రాగా, పరమానందుడు నీలంరంగు పువ్వుల వృక్షంతో తిరుగు ప్రయాణమయ్యాడు. రాజ ధానికి చేరి రాజునూ, రాజకుమారి మోతీరాణినీ సందర్శించి ఆ వృక్షాన్ని వారికి అప్పగించాడు. రాజు దాన్ని తన ఉద్యానవనంలో నాటించడం చూసి రాకుమారి పరమానందం చెందింది. రాజు తన కుమార్తెను పరమానందుడికిచ్చి వివాహం జరిపించడానికి అంగీకరించాడు.



మహనీయుల జీవితాల్లో ఆసక్తికర ఉదంతాలు (19)

# స్వర్గానికి అడ్డదారి లేదు!

తెల్లవారడానికి ఇంకా ఒక గంటసేపు ఉంది. సుప్రసిద్ధ వైష్ణవగురువు రామానందుడు అప్పటికే గంగానదిలో స్నానం చేసి తన ఆశ్రమానికి తిరిగివస్తున్నాడు. నదినుంచి మెట్లదారి స్పష్టంగా కనిపించకపోయినప్పటికీ, అలవాటయిన ప్రాంతం గనక గురువు మెల్లగా అడుగులు వేసుకుంటూ ముందుకు నడవసాగాడు.

ఉన్నట్టుండి ఆయన, ''రామా! రామా!'' అంటూ బిగ్గరగా విలపించాడు. మెట్ల మీద పడుకున్న వ్యక్తి మీద చీకట్లో గమనించకుండా కాలువేయడమే ఆ అరుపుకు కారణం.

''నేను ధన్యుణ్ణయ్యాను. మంత్రోపదేశం పొందాను,'' అంటూ అక్కడ పడుకున్న యువకుడు సంతోషంగా లేచి నిలబడ్డాడు. గురువు యువకుణ్ణి గుర్తుపట్టాడు. తనను శిష్యుడిగా స్వీకరించి మంత్రోపదేశం చేయమని అంతకు ముందు ఆ యువకుడు గురువు రామానందుణ్ణి వేడుకున్నాడు. అయినప్పటికీ, గురువు అతన్ని దూరంగా ఉంచసాగాడు. బహుశా ఆ యువకుడి పుట్టు పూర్వోత్తరాలు స్పష్టంగా తెలియకపోవడమే అందుకు కారణం కావచ్చు. నేతపని చేసే ముస్లిం దంపతులు అతణ్ణి పెంచారు. అయితే, పుట్టుకతో బ్రాహ్మణుడని చెబుతారు. అతడు అటు ముస్లింలతోనూ, ఇటు హిందువులతోనూ సఖ్యంగా కలిసి మెలిసి తిరిగేవాడు.

ఆ యువకుడే ఉత్తరోత్తరా సంత్ కబీర్‌గా ప్రసిద్ధిగాంచాడు. తన శిష్యుడు తనను మించి పోవడం చూసి గురువు రామానందుడు పరమానందం చెందాడు. ఆయన సైతం శిష్యుడి బోధనలతో ప్రభావితుడయ్యాడు.

కబీర్ జనన మరణాల గురించి ఇదమిత్థంగా తెలియదు. ఆయన 1440వ సం.లో జన్మించి, 1518లో కాలధర్మం చెంది వుండవచ్చని భావిస్తున్నారు.

ఆ కాలఘట్టంలో వివిధ మతానుయాయులలో నెలకొన్న రకరకాల మూఢనమ్మకాలను, అర్థరహిత ఆచార సంప్రదాయాలను రూపుమాపడానికి ఆయన జీవితాంతం పోరాడాడు. అందరికీ దేవుడు ఒక్కడే గనక హిందూ, ముస్లిం మతస్థులు సమైక్యంగా ఉండాలని బోధించాడు. దేవుడు ఆశించేది బాహ్యాడంబరాలు కావనీ, ఆంతరంగిక భక్తి, హృదయ నైర్మల్యం మాత్రమే అనీ బోధించాడు.

ఒకసారి ఆయనతో చర్చించడానికి ఒక ముస్లిం పండితుడు వచ్చాడు. కబీర్ ఇంటి

## చందమామ ఇండియా క్విజ్-4 (మే 2007) సమాధానాలు

1. ఆయన ఒక అడవిపంది చేత చంపబడ్డాడు.
2. జగదీష్ చంద్రబోస్.
3. శుశ్రుతుడు; క్రీ.శ. 6వ శతాబ్దం.
4. సి.వి. రామన్; నోబెల్ బహుమతి.

ముందున్న గుంజకు ఒకపందిని కట్టి ఉండడం చూసి, ''ఇంటి ముందు ఎందుకీ అపరిశుభ్రం గావున్న మురికి ప్రాణిని కట్టి ఉంచావు?'' అని అడిగాడు అతడు కోపంగా.

''మిత్రమా, శుభ్రతలేని ఈ మురికి ప్రాణినా ఇంటివెలుపల వాకిట్లో మాత్రమే ఉంది. అయితే, ఒకసారి నీ మనసు లోకితొంగి చూడు. అక్కడకామ క్రోధాలు, ఈర్ష్యాద్వేషాలు, అహంకారమమకారాలు అంటూ ఎన్నెన్ని శుభ్రత ఎరుగని మురికి ప్రాణులను లోలోపల పెంచి పోషిస్తున్నావో నీకే తెలుస్తుంది!'' అన్నాడు కబీర్.



ఒకనాడు కబీర్ మఘర్ అనే గ్రామం గుండా వెళుతూ, కాళ్ళుచేతులు కదపలేని ఒక వృద్ధుడు ప్రాకుతూ వెళ్ళడం చూశాడు. ''ఎందుకిలా కష్టపడి ప్రాకుతున్నావు?'' అని అడిగాడు కబీర్. ''ఎలాగైనా కాశీకి చేరుకుని అక్కడ ప్రాణాలు వదిలితే, తిన్నగా స్వర్గానికి వెళతాను కదా. ఇక్కడ మరణిస్తే నా ఆత్మ నరకం పాలవుతుంది,'' అన్నాడు వృద్ధుడు.

''అలాగా! అంటే కాశీలో ఒక గాడిద చచ్చినా అది అడ్డుదారిలో స్వర్గానికి వెళుతుం దన్న మాట! అదే కదా నీ అభిప్రాయం? అలాంటప్పుడు నేను ఇక్కడ మఘర్‌లోనే మరణిస్తాను,'' అన్నాడు కబీర్. చెప్పిన మాట ప్రకారం ఆయన మఘర్‌లోనే స్థిరపడ్డాడు. అంటే-ఒకవ్యక్తి స్వర్గానికి వెళ్ళడం, నరకం పాలుకావడం అన్నది మరణించే స్థలం మీద ఆధారపడి వుండదనీ; అది అతడు నీతీ నిజాయితీతో జీవించాడన్న విషయం మీద ఆధార పడివుంటుందనీ ఆచరణ ద్వారా ప్రజలకు తెలియజేయడానికే కబీరు అలాచేశాడు.

కబీర్ మఘర్‌లోనే కాలధర్మం చెందాడు. అప్పటికే ఆయనకు హిందువుల్లోనూ, ముస్లిం లలోనూ చాలా మంది శిష్యులు ఉన్నారు. ఆయన భౌతిక కాయాన్ని దహనం చేయాలని హిందువులూ, సమాధిచేయాలని ముస్లింలూ ఆశించారు. తీరా ఆయన కాయానికి కప్పిన శాలువాను తొలగించి చూస్తే అక్కడ పువ్వులు మాత్రమే కనిపించాయి. మరేదీ లేదు. ఆ పూలను ఇరు వర్గాల శిష్యులూ పంచుకు న్నారు. హిందువులు పూలను అగ్నికి ఆహుతి చ్చారు. ముస్లింలు వాటిని పాతిపెట్టి దాని మీద సమాధి నిర్మించారు. -(ఎం.డి)



ఈ శీర్షికలో మొట్టమొదటిదిగా మన ప్రియతమ రాష్ట్రపతి డా. ఎ.పి.జె. అబ్దుల్ కలాం రచనను ప్రచురించడం చాలా సంతోషకరమైన విషయం. మనదేశంలోని ప్రముఖ విజ్ఞానశాస్త్ర వేత్తలలో ఒకరైన డా. అబ్దుల్ కలాం 1931వ సం. రామేశ్వరంలో ఒక మధ్యతరగతి కుటుంబంలో జన్మించారు. భారత ప్రభుత్వ 'సైంటిఫిక్ అడ్వైజర్' పదవీ బాధ్యతలు నిర్వహించారు. దేశం ఆయన్ను 'భారత రత్న' పురస్కారంతో సత్కరించింది. 2002 జూలై 24వ తేదీ ఆయన భారత రాష్ట్రపతిగా ఎన్నుకోబడ్డారు.

అడిగినదే తడవుగా నిజం విలువను తెలియజేసే చక్కని కథను పంపినందుకు డా. అబ్దుల్ కలాం గారికి చందమామ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నది. -సం.

# ప్రాణాన్ని కాపాడిన నిజం

దాదాపు వెయ్యి సంవత్సరాలకు పూర్వం షేక్ అబ్దుల్ ఖాదిర్ అల్-గిలానీ అనే గొప్ప సాధువు నివసించాడు. ఆయన ఎనిమిదేళ్ళ ప్రాయంలో ఒక అద్భుత సంఘటన జరిగింది. ఒకనాడు ఒక ఆవు, ''పశువులు మేసే ఈ పొలాల మధ్య ఏం చేస్తున్నావు? నువ్వు సృష్టించబడింది ఇందుకు కాదు,'' అనడం ఆయన విని ఉలిక్కిపడ్డాడు. హడలిపోయి ఇంటికేసి పరిగెత్తి పోయి ఇంటి పైకప్పు మీదికి ఎక్కి నిలబడ్డాడు. దూరంలో గుంపులు గుంపులుగా ప్రజలు రావడం చూశాడు. వాళ్ళు మెక్కా సమీపంలోని అరాఫత్ పర్వతం మీద హజ్ ప్రార్థనలు జరిపి తిరిగివస్తున్నారు.

అబ్దుల్ ఖాదిర్‌లో చెప్పరాని ఉత్సాహం పెల్లుబికింది. అతడు బాగ్దాదు వెళ్ళి జ్ఞాన మార్గంలో నడవడానికి తనను అనుమతించమని తల్లిని వేడుకున్నాడు. దైవనిర్ణయాన్ని గ్రహించిన అతని తల్లి అందుకు వెంటనే సమ్మతించింది. సంతోషంగా అనుమతి ఇవ్వడంతో పాటు, అబ్దుల్ ఖాదిర్‌కు తండ్రి నుంచి సంక్రమించిన అతని వాటా నలభై బంగారు నాణాలను అతనికి ఇచ్చింది. ఆ నాణాలను ఆమె ఖాదిర్ ధరించిన కోటు లోపలివైపు బట్టలో దాచి కుట్టింది. కొడుకు బయలుదేరుతూండగా, ''నాయనా, నువ్వు నన్ను వదిలి వెళుతున్నావు. అల్లా నిమిత్తం నిన్ను నేను నా నుంచి దూరం చేసుకుంటున్నాను. 'తుదితీర్పు' రోజు వరకు నిన్ను చూసే అవకాశం లేదనుకుంటాను. ఇప్పుడు నీ తల్లి ఇస్తున్న సలహా ఒక్కటే. నువ్వు ఎల్లప్పుడూ సత్యంగా జీవించాలి. ప్రాణాల మీదికి వచ్చినా సరే సత్యమే మాట్లాడాలి. సత్యాన్నే ప్రచారం చేయాలి,'' అన్నది.

అలాగే అనిచెప్పి అబ్దుల్ ఖాదిర్ బాగ్దాదుకు మరికొందరు ప్రయాణీకులతో కలిసి బయలుదేరాడు. అలా ప్రయాణం చేస్తూ వాళ్ళొక కష్టమైన మార్గంలో వెళుతూండగా, గుర్రాలపై వచ్చిన దొంగలు వాళ్ళను చుట్టుముట్టి దోచుకోసాగారు. ఒక దొంగ ఖాదిర్ కేసి తిరిగి, ''చూడ్డానికి బిక్షగాడిలా ఉన్నావు. నీ దగ్గర ఏమైనా ఉన్నదా?'' అని అడిగాడు.

''నా దగ్గర నలభై బంగారు నాణాలు ఉన్నాయి. వాటిని మా అమ్మ నా కోటులోపల బట్టలో భద్రపరచి కుట్టింది,'' అని సమాధానమిచ్చాడు ఖాదిర్.



కుర్రవాడు హాస్యమాడుతున్నాడని భావించి, ఆ దొంగ నవ్వుకుని అవతలికి వెళ్ళిపోయాడు. కొంతసేపటికి రెండో దొంగ వచ్చి ఖాదిర్‌ను అదే ప్రశ్న అడిగాడు. మళ్ళీ ఖాదిర్ అదే సమాధానం చెప్పాడు. ఈ దొంగ కూడా అతని మాట నమ్మకుండా వెళ్ళిపోయాడు.

తమ నాయకుడు రాగానే ఆ ఇద్దరు దొంగలు ఖాదిర్‌ను లాక్కుపోయి అతడి ముందు నిలబెట్టి, ''ఈ కుర్రాడు చూడ్డానికేమో బిక్షగాడిలా ఉన్నాడు. అయితే, తన వద్ద నలభై బంగారు నాణాలు ఉన్నాయంటున్నాడు. మిగిలిన అందరినీ మేము దోచుకున్నాం గాని, వీడి జోలికి పోలేదు. వీడు చెప్పిన బంగారు నాణాల మీద నమ్మకం కుదరక వీణ్ణి అసలు ముట్టుకోలేదు. వీడు మనల్ని ఆటపట్టించాలని చూస్తున్నాడులాగున్నది,'' అన్నారు.

దొంగల నాయకుడు కూడా అబ్దుల్ ఖాదిర్‌ను మళ్ళీ అదే ప్రశ్న అడిగాడు. ఖాదిర్ అదే సమాధానం ఇచ్చాడు. దొంగల నాయకుడు వాడి కోటును విప్పి చూస్తే వాడు చెప్పినట్టే నలభై బంగారు నాణాలు కనిపించాయి. అమితాశ్చర్యం చెందిన దొంగల నాయకుడు, సులభంగా తప్పించుకునే మార్గం ఉండీ కూడా నిజం చెప్పడానికిగల కారణం ఏమిటని ఖాదిర్‌ను నిలదీశాడు.

''ప్రాణాలు పోయినా సరే సత్యమే చెప్పాలని మా తల్లి నా దగ్గర మాట తీసుకున్నది. ఇప్పుడు నలభై బంగారు నాణాల కోసం, నా తల్లి నా మీద ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయకూడదు కదా. అందుకే నిజం చెప్పాను,'' అన్నాడు అబ్దుల్ ఖాదిర్.

దొంగల నాయకుడు కళ్ళ నుంచి పెల్లుబుకుతూన్న కన్నీటి బాష్పాలను తుడుచుకుంటూ, ''పిన్నవాడివైనా నువ్వు మహనీయురాలైన నీ తల్లి సలహాను పాటించావు. మేమేమో మా తల్లిదండ్రులు మా మీద ఉంచిన నమ్మకాన్ని కాలరాచి, సృష్టికర్త ఒడంబడికను కూడా అనేక సంవత్సరాలుగా మోసగిస్తున్నాము. ఈ క్షణం నుంచి నువ్వే మాకు మంచి మార్గం చూపాలి. మా పాపాలకు పశ్చాత్తాప పడుతున్నాం. ఇకపై నువ్వే మా నాయకుడివి,'' అన్నాడు.

ఆ క్షణమే దొంగలందరూ దొంగతనాలు చేయడం మానేయాలని నిర్ణయించారు. ఆ రోజు నుంచి సత్ప్రవర్తనతో మంచి వాళ్ళుగా మారారు.

ఉత్తమురాలైన ఒక తల్లి, తన బిడ్డకు ఇచ్చిన సలహా కారణంగా ఆ రోజే షేక్ అబ్దుల్ ఖాదిర్ అల్-గిలానీ అనే గొప్ప సాధువు ఆవిర్భవించాడు.



# ఆ రోజు జ్ఞాపకాలు

మహారాష్ట్ర రాయ్‌ఘర్ గ్రామం సైకిల్ భావే ఇంటి పక్కన ఉన్న అందమైన పెద్ద చెట్టుకింద కూర్చుని కవిత రాసుకుంటున్నాను. చెట్టు కింద కూర్చున్నానని చెప్పానుకదా అని ఆ చెట్టు పేరేమిటని నన్ను అడక్కండి. చెప్పలేను. ఎందు కంటే దానిపేరు నాకూ తెలియదు.

రెండు రోజులుగా నేను సైకిల్ భావే ఇంట్లోనే ఉంటున్నాను. మధురమైన కవిత నా కలం నుంచి గలగలా కాగితం మీదికి జాలువారడానికి ఇంధనం ఏమిటో తెలుసా? సైకిల్ భావే భార్య తయారు చేసి ఇచ్చిన వేడి వేడి 'నగ్లీచీ భక్రి' రొట్టెలు.

కవితరాయడం పూర్తయింది. ఒకటి రెండు సార్లు చదివి చూసుకుని నోటు పుస్తకం మూసి సంచీలో పెట్టుకుని లేచి నిలబడ్డాను. అప్పుడే జయతాయ్, ఆమె కూతురు కాలిబాటగుండా సమీపంలోని నది కేసి వెళ్ళడం నా కంటబడింది. వాళ్ళిద్దరూ తీసుకెళుతున్న నాలుగు ఖాళీ బిందె లను చూడగానే, నీళ్ళు తెచ్చుకోవడం కోసం నదికి వెళుతున్నారని తెలిసిపోయింది. తాగ డానికి, వంట చేయడానికి, బట్టలుతకడానికి వాళ్ళా నీళ్ళనే ఉపయోగిస్తారు. నేనూ వాళ్ళ

వెనకే వెళ్ళడానికి అడుగులు ముందుకువేశాను. కడుపునిండా తిన్న 'నగ్గీలు' అరగాలి కదా మరి.

వాళ్ళ వెనక నడుస్తూంటే, అనుకోకుండా ఢిల్లీలోని మా ఇల్లూ, అక్కడి మా జీవితం నాకు జ్ఞాపకం వచ్చాయి. కుళాయి తిప్పితే చాలు. కావలసినన్ని నీళ్ళు వస్తాయి. ఈ గ్రామ ప్రజలు బతకడానికి ప్రాథమిక అవసరమైన మంచి నీళ్ళ కోసం ఇంత దూరం నడిచి వెళ్ళాలి. పాపం అనిపించింది. అవునూ, వీళ్ళు కలుషితమైన ఈ నది నీళ్ళను తాగడానికి, వంట చేయడానికి ఎలా శుభ్రపరచి ఉపయోగిస్తారు? అన్న అనుమానం కూడా నాలో తలెత్తింది. నదీ జలాన్ని అన్నింటికీ ఉపయోగించుకోవడం ఎంతవరకు క్షేమకరం? ఇలా రకరకాల ప్రశ్నలు నా మనసులో కదలాడసాగాయి.

ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూనే వాళ్ళతోపాటు నదిని సమీపించాను. జయతాయ్ కూతురు నదినుంచి బిందెలతో నీళ్ళు ముంచుకోసాగింది. అయితే, జయతాయ్ తన కూతురు దగ్గరలేదు. కాస్త దూరంగా ఆమె మరేదో చేస్తోంది... పరిశీలనగా చూశాక తెలిసింది. ఆమె గొయ్యి తవ్వుతోంది!

నా కళ్ళు ఆ స్థలాన్ని పరిశీలించి చూడసాగాయి. జయతాయ్ తవ్వుతూన్న గోతుల్లాంటివి అక్కడ ఇంకా చాలా కనిపించాయి. అవన్నీ కూడా నదికి 20-30 అడుగుల దూరం లోపులోనే ఉన్నాయి. నా మనసులోని ఆదుర్దా మాటల రూపంలో బయటపడింది. జయతాయ్‌ని గోతి ఎందుకు తవ్వుతున్నావని అడిగాను. తాగు నీటి కోసం గొయ్యి తీస్తున్నట్టు ఆమె చెప్పింది. ఆమె చేస్తూన్న పనిని కొంతసేపు నెమ్మదిగా చూశాక అసలు సంగతి అర్థమయింది. ఏటికి సమీపంలో ఇసుకలో నీళ్ళు కనిపించేంతవరకు గొయ్యి తీస్తారు. గోతి నుంచి నీళ్ళు ముంచుకుంటారు. జయతాయ్ కూతురు నది నుంచి తెచ్చిన నీళ్ళకన్నా ఇవి ఎంతో తేటగా కనిపించాయి. బహుశా అందుకేనేమో గ్రామస్థులు ఈ నీళ్ళను తాగడానికీ, వంట చేయడానికీ బావుంటాయని భావించి ఉపయోగిస్తున్నారు.





# మన దేశం క్విజ్

## ఈ నెల క్విజ్ ఆయుధాలకు, సైనిక అధికారులకు సంబంధించినది



1. శ్రీరాముడికి పరశురాముడు ఇచ్చిన ధనుస్సు పేరేమిటి?
2. మన దేశపు మొట్టమొదటి ఎయిర్‌క్రాఫ్ట్ క్యారియర్ పేరేమిటి?
3. ఇద్దరు ప్రముఖ సైనిక అధికారులు ఫీల్డ్ మార్షల్స్‌గా చేయబడ్డారు. వారెవరు?
4. ఇంద్రుడి ఆయుధం పేరేమిటి?
5. మొట్టమొదటి వైమానిక దళ సిబ్బంది నాయకుడి పేరేమిటి?
6. భూమి నుంచి భూమికి దూసుకు వెళ్ళే భారత దేశ క్షిపణి (మిసైల్) పేరేమిటి?



(సమాధానాలు 66వ పేజీలో)

ఇలా చేయడం నేను ఇంతకు ముందెన్నడూ చూడలేదు. అయినా గ్రామ ప్రజలందరూ ఎందుకిలా అవస్థపడుతున్నారు? అందరూ కలిసి ఒక బావి తవ్వుకుంటే సరిపోతుంది కదా? వాళ్ళు అలా బావి తవ్వక పోవడానికి మరేదో బలమైన కారణం ఉండితీరాలి.

గ్రామం నదికి దూరంలో ఉంది. సైకిల్ భావే ఇంటికి సమీపంలో బావి అంటే మరీ లోతుగా తవ్వవలసి ఉంటుంది. అప్పుడుగాని నీళ్ళు పడవు. ఇంతకు పూర్వం ఊళ్ళో కొన్ని బావులు ఉండేవనీ, ఇప్పుడవన్నీ ఎండిపోయాయనీ నాకు తరవాత తెలియవచ్చింది. ఊరు చుట్టూ వున్న చెట్లను నరికివేయడమే అందుకు కారణం.

భూగర్భజలాలు సమృద్ధిగా ఉండాలంటే అందుకు దట్టంగా చెట్లు ఉండితీరాలి. చెట్లు యేటేటా వర్షాకాలంలో వర్షపునీళ్ళు వృధాగా వెళ్ళిపోకుండా అడ్డుకుంటాయి. నీళ్ళు భూమి లోపలికి ఇంకేలా చేస్తాయి.

అవును. చెట్లు లేకపోవడమే భూగర్భ జలాలు అడుగంటి పోవడానికి కారణం కావచ్చు. చుట్టు పక్కల కనుచూపు మేరలో అడవి అంటూ లేదు. ఆ కాలంలో ఉన్న చెట్ల గురించి సైకిల్ భావే తల్లి నాకు చెప్పింది కూడా. ఆ రోజుల్లో ఆమె దూరంలో ఉన్న అడవికి నడిచే వెళ్ళి, 'కార్వంద్' పళ్ళు తెచ్చుకునేదట. ఇప్పుడు అవన్నీ కనుమరుగై పోయాయి.

బరువైన మనసుతో నేను నెమ్మదిగా తిరిగి వచ్చి, మొదట కూర్చున్న చెట్టు నీడలో కూర్చుని కళ్ళు మూసుకున్నాను.... మనసులో అందమైన కోరిక... నేను ఇప్పుడు ఉంటూన్న సైకిల్ భావే ఇంటి చుట్టూ, రూయ్‌ఘర్ గ్రామ పరిసరాలకూ ఒకప్పుడున్న చెట్లన్నీ మళ్ళీ రావాలి... త్వరలో రావాలి!

-కాంచీ కోహ్లీ



# అరవైయేళ్ళ చందమామ



ఆకాశవీధిలో మేఘాలపై కూర్చుని మందహాసంతో చూస్తున్న చంద మామకు అక్కాతమ్ముళ్ళు ఆనందంతో స్వాగతం పలుకుతూండగా పక్కనే పురివిప్పిన నెమలి నాట్యం చూసి ఉరకలు వేస్తున్న ఉత్సాహంతో ఆడు తూన్న చిన్నారి! ఆకర్షణీయమైన ఈ ముఖచిత్రంతో చందమామ పిల్లల మాసపత్రిక తొలిసంచిక 1947 జూలైలో వెలువడింది!

పిల్లలను ఆప్యాయంగా పలకరించి తొలి సంపాదకీయంలో, ''మీకు కింది భూలోకంలో, పైన ఆకాశంలో నేను చూసిన వింతలూ, విడ్డూరాలూ అన్నీ చెబుతాను. నాకు తెలిసిన కథలు... గమ్మత్తులు అన్నీ మీకు వినిపిస్తాను,'' అని చందమామ మాట ఇచ్చింది. ఆ మాటకు అనుగుణంగా గత అరవైయేళ్ళుగా చందమామ నెలనెలా ఆసక్తికరమైన కథలూ, పురాణగాథలూ, చారిత్రక సాంస్కృతిక అంశాలూ, విజ్ఞాన విశేషాలూ, అందరినీ అలరించి ఆకట్టుకునే విధంగా అందిస్తున్నది. వీటన్నిటినీ ఆకర్షణీయమైన రంగు రంగుల చిత్రాలతో అందివ్వడం చందమామ ప్రత్యేకత!

సామాన్య ప్రజలలో అక్షరాస్యత అంతంత మాత్రంగా వున్న ఆ కాలఘట్టంలో బాలబాలికల పఠనాసక్తిని పెంపొందించడంలో చందమామ చేసిన కృషి అనన్య సామాన్యం. చిన్న చిన్న పదాలతో, బుల్లి బుల్లి వాక్యాలతో సరళమైన వ్యావహారిక భాషలో రచనలు ప్రచురించింది. భాషాపరంగా అదొక విప్లవాత్మకమైన మార్పుకు దోహదం చేసింది. పాఠకుల అశేష అభిమానంతో పాటు విజ్ఞుల అభినందనలు కూడా అందుకున్నది!

జీవిత సత్యాలను ఆసక్తికరంగా విడమరచి చెప్పేవి, మంచిని ప్రబోధించేవి, ఉన్నత విలువలను తెలియజేసేవి, మనసుకు ఆరోగ్యకరమైన వినోదాన్ని అందించేవి-ఏ ప్రాంతం, ఏ దేశం కథలైనా సరే మన పిల్లలందరికీ అందజేయాలన్న ఉదాత్త ఆశయంతోనే వివిధ రాష్ట్రాల, వేర్వేరు దేశాల కథలను, జానపద కథలను చందమామ ప్రచురిస్తున్నది. సంక్షిప్తంగా, సరళ సుందరంగా మన పురాణ కథలతో పాటు, ఒకవైపు పంచతంత్ర కథలు-మరోవైపు కాళిదాసు విర చిత నాటక కథలు ప్రచురిం చింది ఈ లక్ష్యంతోనే.





అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కొనే ధార్మిక, నైతిక విలువలు జానపద కథలలో కోకొల్లలుగా కనిపిస్తాయి. ఇలాంటి కథలు చిన్నారులను ఆకర్షించడమే కాకుండా వారి దృష్టిని ఉన్నత లక్ష్యాలవైపు మళ్ళిస్తాయి. అందువల్లనే ఇలాంటి కథలకు చందమామ పెద్దపీట వేసి, వివిధ ప్రాంతాల, దేశాల జానపద కథలను ప్రచురిస్తోంది.

ప్రాచుర్యంలో వున్న పాత జానపద కథలను మాత్రమే ప్రచురించి ఊరుకోకుండా, కృత్రిమ జానపద కథలను అంటే అదే ఒరవడిలో కొత్త కథలను రాసే రచయితలను చందమామ ప్రోత్స హిస్తున్నది.

వీటన్నిటికీ కూడా చందమామ తొలి సంచిక నుంచే పునాదులు బలంగా పడ్డాయి. చందమామ ప్రారంభసంచికలను ఒక్కసారి తిరగేస్తే ఈ విషయం తేటతెల్లమవుతుంది.

తల్లి భాష ప్రాశస్త్యాన్ని తెలియజేస్తుంది తొలి సంచికలో వెలువడిన 'తల్లి లేని పిల్లికూన'. హాస్యప్రధానంగాసాగే తెనాలి రామలింగడి కథలు తొలిసంచిక నుంచే ప్రారంభమయ్యాయి. 'జిత్తులమారి నక్కబావ'లో మోసబుద్ధికి తగిన గుణపాఠం లభిస్తుంది. 'బండరాముడు' సీరియల్ ఒక చిన్నవాడి జీవితంలో జరిగే సంఘటనలను సరదాగా వివరిస్తుంది. పర్షియా రాజకుమారుడి సాహస కథ 'కీలుగుర్రం'. ఒక చెవిటివాడు, గుడ్డివాడు కలిసి రాక్షసుణ్ణి తెలివిగా తరుమగొట్టడం 'గీక్షసులు' వివరిస్తుంది.

'గాంధీతాత'తో ప్రారంభమయ్యే 'మహాపురుషుల జీవిత చరిత్ర' శీర్షిక 'పండితజీ' 'సర్దార్ వల్లభాయి పటేల్' అంటూ ముందుకు సాగుతుంది.

చందమామ 'నా ఆత్మకథ'లో-చంద్ర గ్రహం పుట్టుపూర్వోత్తరాలనూ, చంద్రుడికి సంబంధించిన పురాణ కథలనూ ఆసక్తి కరంగా వివరిస్తుంది!



ఇంకా ఇందులో కాకమ్మక్క కథ, పొట్టి పిచిక కథ, పండుటాకులపాట మొదలైనవి చోటు చేసుకు న్నాయి.

సుప్రసిద్ధమైన కథలను యథాతథంగా కాకుండా కొన్ని మార్పులతో ప్రచురించడం కూడా జరిగింది. ఉదాహరణకు 'చదువుకున్న కాకిపిల్ల' (జనవరి '48)ను తీసుకుందాం. ఒక కాకి నోట్లో వున్న మాంసం ముక్కను కాజేయాలనుకుంటుంది ఒక నక్క. కాకి కంఠస్వరాన్నీ, పాటనూ తెగపొగుడుతుంది. ఆ పొగడ్తలకు పొంగిపోయి పాడడానికి నోరు తెరవగానే, కాకి నోట్లో వున్న మాంసం ముక్క కిందపడి నక్క పాలవుతుంది. ఇది అందరికీ తెలిసిన కాకి-నక్క కథ. ఇక 'చదువుకున్న కాకిపిల్ల' కథలో కూడా మాంసం ముక్కతో ఉన్న కాకిపిల్ల పాటనూ, ఆటనూ తెగ మెచ్చేసుకుని పాట పాడమంటుంది నక్క. కాకిపిల్ల మాంసం ముక్కను కాలి గోళ్ళతో పట్టుకుని పాడుతుంది. నాట్యం చేయమంటుంది నక్క. కాకిపిల్ల మాంసం ముక్కను నోటితో కరుచుకుని నాట్యం చేస్తుంది. పాడుతూ ఆడమని నక్క కాకిపిల్లను కోరుతుంది. కాకిపిల్ల వెంటనే మాంసం ముక్కను తినేసి హాయిగా పాడుతూ ఆడుతుంది! నక్క ఆశాభంగంతో తోకముడుస్తుంది!

ఇలా కథలలోనే కాదు; ఇతర శీర్షికలలోనూ-సంపాదకీయం నుంచి ఫోటో వ్యాఖ్యల పోటీ వరకు చందమామ అరవైయేళ్ళకుపైగా ఎన్నెన్నో ప్రయోగాలుచేస్తూ, ఆయా తరాల పాఠకుల అవసరాలకు అనుగుణంగా మార్పులు చేసుకుంటూ ముందుకు సాగుతున్నది. మారనిదల్లా ఒక్కటే: పిల్లలను ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దాలన్న వ్యవస్థాపకుల ఉన్నత ఆశయం. అందుకే పెద్దలు కూడా చదివే పిల్లల పత్రికగా, ఇంటిల్లిపాదీ చదివే కుటుంబ పత్రికగా చందమామ ఈనాటికీ అందరి ఆదరాభిమానాలూ పొందగలుగుతున్నది.

అరవైయేళ్ళుగా విజయపథంలో నడుస్తున్న చందమామ వ్యవస్థాపకులు కీ.శే. శ్రీ బి. నాగిరెడ్డి-చక్రపాణి గార్లకూ, పత్రిక విజయానికి కృషి చేస్తున్న సంపాదకులకూ, రచయితలకూ, చిత్రకారులకూ, కార్యాలయ సిబ్బందికీ, ప్రకటనకర్తలకూ, ఏజెంట్లకూ - ముఖ్యంగా మూడు తరాలుగా పత్రికను ఆదరిస్తున్న పాఠకులకూ హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం. ఈ విజయాన్ని వారికి అంకిత మిస్తున్నాం.





# చందమామ ఇండియా క్విజ్ - 6

Co-sponsored by
Infosys FOUNDATION, Bangalore

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

నూతన విద్యాసంవత్సరం ఆరంభమయింది. ఈ సందర్భంగా మనదేశంలోని విశ్వవిద్యాలయాలకు సంబంధించిన విషయాలను ఈ నెల క్విజ్‌లో తెలుసుకుందాం.

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే బహుమతి మొత్తం డ్రా ద్వారా తీసిన ఐదుగురికి సమానంగా పంచబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే: 1. సమాధానాలు రాయండి. 2. మీ పేరు, వయసు (16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్‌కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి. 3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి. 4. కవరు మీద చందమామ ఇండియా క్విజ్- 6 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి. 5. జూలై నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి. 6. సెప్టెంబర్ 2007 నెల సంచికలో ఫలితాలు వెలువడతాయి.

1. ప్రపంచంలోనే మొట్టమొదటి రెండు ప్రాచీన విశ్వవిద్యాలయాలు మనదేశంలో వెలిశాయని చెబుతారు. అవి ఏవి? ఎప్పుడు స్థాపించారు?
2. ఈస్ట్ ఇండియా కంపెనీ ఒక సంస్కృత పాఠశాలను స్థాపించింది. ఎక్కడ? దాని ఇప్పటి పేరేమిటి? అది ప్రసిద్ధి చెందడానికిగల కారణం ఏమిటి?
3. ఒక విశ్వవిద్యాలయాన్ని స్థాపించిన తొలి భారతీయుడు ఎవరు? ఎప్పుడు స్థాపించాడు?
4. 19వ శతాబ్దంలో ఒకే సంవత్సరంలో మూడు విశ్వవిద్యాలయాలు నెలకొల్పబడ్డాయి. ఏ విశ్వ విద్యాలయాలు? ఎప్పుడు?



5. దక్షిణ భారదేశంలోని ఒక విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా వున్న ఒక విద్యావేత్త ఆ తర వాత 'యునెస్కో'లో ఉన్నత పదవిని అలంక రించాడు. ఆయన ఎవరు?
6. 'ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్' ఎక్కడ ఉన్నది?
7. ఇద్దరన్నదమ్ములు రెండు విశ్వవిద్యాలయాల వైస్‌ఛాన్సలర్ పదవులు అలంకరించారు. వారెవరు? ఏయే విశ్వవిద్యాలయాలకు?



# నిత్యసంతోషి

ఆస్తి పాస్తుల్లో, తెలివితేటల్లో, పలుకుబడిలో సమఉజ్జీ అయినప్పటికీ పొరుగింటి రామేశం తనకన్నా ఎప్పుడూ సంతోషంగా ఎలా ఉండగలుగుతున్నాడన్న సంగతి కామేశానికి ఎంత ఆలోచించినా అంతుపట్టేది కాదు. పైగా, దాన్ని గురించి ఆలోచించే కొద్దీ కామేశానికి విచారం కలిగేది. ఒక్కొక్కసారి అసూయతో దహించుకు పోయేవాడు. రామేశం సంతోషాన్ని ఎలాగైనా హరించాలన్న పట్టుదలతో కామేశం ఉపాయం కోసం అన్వేషిస్తూన్న సమయంలో ఆ ఊరికి హిమాలయాల నుంచి జడయోగి వచ్చాడు.

అప్పుడప్పుడు జనం మధ్యకు వచ్చే ఆ మునికి జుత్తు జడలు కట్టి ఉండడం వల్ల జడయోగి అన్న పేరువచ్చింది. ఏ సమస్యకైనా పరిష్కారం చెప్పే మేథస్సూ, ఏ జబ్బయినా తగ్గించే మూలికలూ, నచ్చిన వారికి వరాలిచ్చే మహిమా ఆయనకు ఉన్నాయి. ఆయన ఏం చేసినా పరోపకారమే జరుగుతుందని అందరూ చెప్పుకుంటారు.

కామేశం జడయోగిని ఇంటికి పిలిచి ఘనంగా ఆతిథ్యమిచ్చాడు. ఆయన సంతోషించి, ''నీకు ప్రయోజనమై, ఇతరులకు నష్టంకాని వరమేదైనా కోరుకో,'' అన్నాడు.

''అన్నింట్లోనూ నేను నా పొరుగు వాడు రామేశం కంటే ఎక్కువగా ఉండాలి,'' అన్నాడు కామేశం.

జడయోగి, ''నీ కోరిక ప్రమాదకరం. రామేశానికి ఒక కన్ను పోతే, నీకు రెండు కళ్ళూ పోతాయి. అతనికి వెయ్యి వరహాలు నష్టమొస్తే, నీకు రెండు వేల వరహాలు నష్టం. నేను అలాంటి వరాలు ఇవ్వను,'' అన్నాడు.

''నా ఉద్దేశం అదికాదు. డబ్బులో, గుర్తింపులో రామేశం కంటే నాదే పైచేయి కావాలి.

బాబి




అందుకేదైనా మార్గం చెప్పండి,'' అన్నాడు కామేశం.

''అతడికి వెయ్యి వరహాలు పోతే నీకు వందపోవడం అధిక్యమే. కానీ అది నీకు మేలు చేయదు కదా. నీ కోరికసత్ఫలితాన్నివ్వా లంటే, రామేశం కలకాలం పచ్చగా ఉండాలి. అది నీకు సమ్మతమేనా?'' అని అడిగాడు జడయోగి.

డబ్బులో, గుర్తింపులో తనదే పైచేయి అయినప్పుడు రామేశం ఎంత పచ్చగా ఉంటే తనకు అంతమంచిదని కామేశం అందుకు ఒప్పుకున్నాడు. అప్పుడు జడయోగి, ''స్వార్థ మున్నా, పరోపకారం కూడా జతపడ్డం వల్ల నీ కోరిక మెచ్చతగినదే. డబ్బులో, గుర్తింపులో నీదే పైచేయిగా ఉండాలని వరమిస్తున్నాను. అయితే, ఒక్క విషయం గుర్తుంచుకో. ఒక్క సారి వద్దనుకున్నావో, నావరం శాశ్వతంగా రద్దవుతుంది,'' అన్నాడు.

ఆ మరునాడు ఉదయం ఇంటి పెరట్లో తవ్వుతుంటే, రామేశానికి ఒక రాగి చెంబు దొరికింది. అందులో ఆయన పూర్వీకులు ముందు తరాల వారికోసం దాచిన పదివేల వరహాలున్నాయి. ఆ విషయం తెలిసి గ్రామ స్థులు రామేశం అదృష్టాన్ని పొగిడారు. అది జడయోగి వరప్రభావమేనని గ్రహించిన కామేశానికి మనసు కలుక్కుమన్నది. అయితే, ఆ సాయంత్రమే కామేశం పొలంలో ఆయన పూర్వీకులు పాతి పెట్టిన లంకెబిందెలు దొరి కాయి. లక్ష వరహాలు విలువ చేసే ఆ నిధిని చూసిన గ్రామస్థులు, ''నువ్వు అదృష్టంలో



రామేశాన్ని మించావు. ఈ సంతోష సమయంలో నువ్వు మా అందరికీ పెద్ద విందు చేయాలి,'' అన్నారు.

కామేశం అందుకు సరేనని, ''ఎవరైనా విందు ఏర్పాట్లు చేయండి. ఖర్చు మొత్తం నేను భరిస్తాను,'' అన్నాడు గొప్పగా రామేశాన్ని చూస్తూ. రామేశం అందుకు ఉత్సాహంగా ముందుకు వచ్చాడు. రామేశం సంతోషంలో నటన లేదని గ్రహించాక కామేశం మనసు కలుక్కుమన్నది.

మరి కొన్నాళ్ళకు రామేశానికి దూరపు బంధువు నుంచి వారసత్వంగా నాలుగెకరాల పొలం సంక్రమిస్తే, కామేశానికి పదెకరాలు వచ్చింది. ఈసారి రామేశమే స్వయంగా కామేశాన్ని విందుకు పిలిచాడు.

ఇక కామేశం ఉక్రోషం పట్టలేక, ''నీకు లాభమొచ్చిందని సంతోషం కొద్దీ విందుకు పిలిస్తే అర్థంవుంది. నాకు లాభమొస్తే నీకెందుకు సంతోషం?'' అని విసుక్కున్నాడు.

రామేశం నవ్వి, ''నాకు లాభమొస్తే కలిగే సంతోషం అప్పటికి మాత్రమే పరిమితం. ఆ తరవాత ఉండదు. అయితే, నేను కోరుకునేది నిత్యసంతోషం. రోజూ నాకు లాభాలు రావు. ఊళ్ళో ఎవరో ఒకరు రోజూ లాభపడుతూనే ఉంటారు గనక, అలాంటి వారికి వచ్చే లాభాలను, జరిగే మంచిని చూసి సంతోషించడం అలవరచుకుంటే రోజూ సంతోషమే మరి,'' అన్నాడు.

కామేశం ఆశ్చర్యపోయాడు. తనకు పెద్ద లాభం కలిగే ముందు రామేశానికి చిన్న లాభం కలిగితేనే తన మనసు కలుక్కుమంటోంది. మరి రామేశమేమో నిత్య సంతోషి కావాలంటే ఇతరుల సంతోషమే తన సంతోషంగా భావించాలంటున్నాడు. జడయోగి తనకిచ్చిన వరం రామేశం సంతోషాన్ని నలుసంత కూడా హరించలేదు సరికదా, అతడికి కలుగుతున్న చిన్న లాభాలు సైతం తన సంతోషాన్ని హరిస్తున్నాయి. అందువల్ల ఆయన జడయోగి ఇచ్చిన వరం పనిచేయకూడదని కోరుకున్నాడు.

అలా వరం పొంది కూడా కామేశం, రామేశం చేతిలో మరోసారి భంగపడ్డాడు.





# ప్రాపకం

చోళసింహపుర రాజ్యాన్ని విద్యాధరుడనే రాజు పరిపాలించేవాడు. మహారాణి శమంతక మణి న్యాయనిర్ణయం చేయడంలో మహా దిట్ట. విషయ పరిశీలనలో, వాస్తవాలను పసిగట్ట డంలో ఆమె అసమానమైన ప్రజ్ఞను కనబర చేది. ఆ సంగతి గ్రహించిన రాజు విద్యా ధరుడు పాలనావ్యవహారాలలో ముఖ్యంగా న్యాయనిర్ణయం చేసేప్పుడు మహారాణిసలహా లను తీసుకునే వాడు. తాను రాజధానిలో లేనప్పుడు న్యాయనిర్ణయం చేయవలసి వస్తే మహారాణిని సంప్రదించమని ప్రధానమంత్రికి చెప్పి వెళ్ళేవాడు.

న్యాయవిచారణ తరవాత చిన్నాచితక నేరాలు చేశారని రుజువైన దోషులకు జరిమా నాలు, జైలుశిక్షలు విధించకుండా వారిచేత ప్రజోపయోగకరమైన పనులను చేయించ మని మహారాణి ఆదేశించేది. చెరువులు, కాలువలు పూడికతీయడం, మొక్కలు నాటడం వంటి పనులు చేయడంవల్ల, ప్రజానీకానికి మేలు జరగడమే కాకుండా దోషులలో అపరాధభావం నశించి మంచి మానసిక పరివర్తన కలిగేది.

రాజ్యంలో ఎలాంటిఅలజడులూ లేకుండా కొన్నాళ్ళు ప్రశాంతంగా రోజులు గడిచాయి. ఒకనాడు మధ్యాహ్నం భోజనం చేస్తూ రాజు విచారంగా ఉండడం మహారాణి గమనించి కారణం అడిగింది.

''ప్రజలకు కావలసిన నిత్యావసర వస్తు వుల ధరలు, ముఖ్యంగా ఆహార ధాన్యాల ధరలు రోజురోజుకూ పెరిగి పోతున్నాయి. ప్రజలు కష్టపడుతున్నారు,'' అన్నాడు రాజు.

''అవును, ప్రభూ. మామూలు ప్రజలు కడుపునిండా తినలేనంతగా ఆహార ధాన్యాల ధరలు పెరిగిపోయాయని మన పరిచారికలు కూడా చెబుతున్నారు. దానికి గల మూల కారణాలను తెలుసుకుని వెంటనే తగిన

గుడిసేవ మురళీధర్

చర్యలు తీసుకోకపోతే ప్రజలు మరిన్ని కష్టాల పాలు కాగలరు. తమ పాలన పట్ల అసంతృప్తి తలెత్తగలదు,'' అన్నది మహారాణి.

''నువ్వన్నది నిజమే. అసలు కారణాలే అంతుబట్టడం లేదు. అదే సమస్య,'' అన్నాడు రాజు నిట్టూరుస్తూ.

''ఆహార ధాన్యాల కొరత ఏర్పడడానికి ప్రధానంగా రెండు కారణాలే వుంటాయి. ఒకటి, పంటలు సరిగా పండకపోవడం; రెండు, వ్యాపారులు ఆహారధాన్యాలను దాచేసి ధరలు పెంచేయడం. మన రాజ్యంలో ధరలు పెరగడానికి ఈ రెండింటిలో ఏది కారణమో తమరే నిర్ణయించాలి,'' అన్నది రాణి.

''గత మూడు సంవత్సరాలుగా సకాలంలో వర్షాలు కురవడం వల్ల పంటలు పుష్కలంగా పండుతున్నాయి. ఇక వ్యాపారుల విషయమే చూడాలి,'' అన్నాడు రాజు.

మరునాడే రాజు మంత్రులతో సమాలోచన జరిపి, గూఢచారుల ద్వారా వ్యాపారుల కార్యకలాపాల మీద నిఘా ఏర్పాటు చేశాడు. మూడో రోజు కల్లా అసలు సంగతి బయట పడింది. దురాశాపరులైన కొందరు వ్యాపారులు సరుకులను అక్రమంగా దాచేసి, కృత్రిమంగా కొరతను సృష్టించి అధిక ధరలకు అమ్ముకుంటున్నారు. సరుకులను ఎవరికీ అనుమానం రాకుండా వ్యాపారస్థలాలలో కాకుండా మరెక్కడో దాస్తున్నారని కూడా తెలియ వచ్చింది. దాంతో అనుమానాస్పదంగా ఉన్న ఇళ్ళను, భవనాలను భటులు గాలించ సాగారు.



రాజధానీ నగరం శివారులో సోమిదేవమ్మ, మనోహరి అనే ఇద్దరు స్త్రీలు వేరు వేరుగా రెండు సత్రాలను నడుపుతూ ప్రయాణీకులకు భోజన సౌకర్యాలు కల్పిస్తున్నారు. వాళ్ళు తమ సత్రాలలో కొన్ని గదులను అక్రమ వ్యాపారులు సరుకులు దాచుకోవడానికి ఇస్తున్నారు.

ఒకనాటి ఉదయం ఇద్దరు రాజభటులు సోమిదేవమ్మ వద్దకు వచ్చి, ''మహారాణి నిన్ను వెంటబెట్టుకు రమ్మన్నారు,'' అని చెప్పారు.

సోమిదేవమ్మ భయపడుతూ వాళ్ళ వెంట వెళ్ళి, సాయంకాలానికి తిరిగి వచ్చింది.

ఆమె రాకకోసం ఆత్రుతగా ఎదురు చూస్తూన్న మనోహరి కుతూహలంగా ఎదురు వెళ్ళి, ''ఏమిటి సోమిదేవమ్మా, పొద్దుననగా వెళ్ళినదానవు చీకటి పడేవరకు రాజభవనం



లోనే ఉన్నావా? ఇంతకూ మహారాణి నిన్నెం దుకు పిలిపించారు? అక్కడేం జరిగింది?'' అని ప్రశ్నలవర్షం కురిపించింది.

సోమిదేవమ్మ నవ్వుతూ, ''ఏముందీ, మహారాణిగారికి పొద్దుపోవడం లేదు. కాల క్షేపం కబుర్లు చెప్పడానికి రమ్మని భటులతో కబురుచేసింది. సత్రం యజమానిగా నాకు చాలా సంగతులు తెలుస్తాయి కదా అని నన్ను పిలిపించింది. వరసగా వారం రోజులు రమ్మని మహారాణిగారి ఆహ్వానం. మధ్యాహ్న భోజనంకూడా మహారాణి పక్కనే,'' అంటూ మరో ప్రశ్నకు తావివ్వకుండా వేగంగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.

మరునాడు ఉదయం కూడా సోమిదేవమ్మ బయటకు వెళ్ళడం మనోహరి గమనించి భర్తనూ, అత్తనూ పిలిచి విషయం చెప్పింది.

భర్త వడ్డీకాసులు అమితాశ్చర్యంతో, ''సోమిదేవమ్మ ఏకంగా మహారాణిగారితోనే స్నేహం సంపాయించిందా! మధ్యాహ్న భోజనం కూడా అక్కడే అంటే మాటలా? ఆమెతో మర్యాదగా వుంటూ మనం కూడా మహారాణి గారి ప్రాపకం సంపాదించాలి,'' అన్నాడు.

''అవునవును. అప్పుడు ఏ అధికారీ మన సత్రం దరిదాపులకువచ్చే సాహసం చేయడు,'' అన్నది మనోహరి ఉత్సాహంగా.

''నువ్వు సున్ని ఉండలు చేస్తున్నావుగా. వాటిలో కొన్ని తీసుకెళ్ళి సోమిదేవమ్మకు ఇవ్వు. నెమ్మదిగా మనల్ని గురించి మహారాణి గారికి చెప్పి, పరిచయం చేయమని చెప్పు,'' అన్నాడు వడ్డీకాసులు.

''ఆ మాట నువ్వు చెప్పాలా? అంత మాత్రం నాకు తెలియదూ?'' అంటూ భర్త మాటకు అడ్డుతగిలిన మనోహరి, ఆ రోజు సాయంకాలం సోమిదేవమ్మ వద్దకు సున్ని ఉండలతో వెళ్ళి, ఆమెను పొగుడుతూ పలక రించి ఇచ్చి వచ్చింది.

అయితే, మరునాడు కొందరు భటులు వచ్చి రెండు సత్రాల్లో దాచిన ఆహార ధాన్యా లను తరలించుకు పోయారు. ఆ సమయంలో వ్యాపారులు అక్కడే ఉన్నా, అడ్డు చెప్పలేక పోయారు.

మనోహరి భర్త వడ్డీకాసులు మాత్రం వాళ్ళు అటు వెళ్ళగానే, ''సోమిదేవమ్మకు మహారాణిగారితో వున్న స్నేహం భటులకు తెలియదులాగుంది,'' అంటూ కాస్సేపు ఆలోచించి, ''వ్యాపారులు వారికి అడ్డు తగలక



పోవడం కూడా ఒక రకంగా మనకు మంచిదే. కొంచెం తెలివి ఉపయోగిస్తే ఈ పరిస్థితిని మనకు అనుకూలంగా మార్చుకోవచ్చు,'' అన్నాడు ఉత్సాహంగా.

''ఎలాగా?'' అని అడిగింది మనోహరి కుతూహలంగా.

''నువ్వు ఇప్పుడే మహారాణిగారి వద్దకు వెళ్ళి, 'మీ భటులు తరలించుకుని వచ్చిన ఆహార ధాన్యాలు వ్యాపారులవి కావు. మావే,' అని చెప్పాలి. అక్కడే వున్న సోమిదేవమ్మ నీకు సాయ పడుతుంది. అప్పుడు సరుకులు మనవే అవుతాయి,'' అన్నాడు.

మనోహరి భర్త చెప్పింది విని, అతని కేసి మెచ్చుకోలుగా చూసి, అప్పటికప్పుడే రాజ భవనానికి బయలుదేరింది. కాపలా భటు లతో, ''మహారాణిగారి స్నేహితురాలు సోమిదే వమ్మ ఎదురిల్లు మాది. మహారాణిగారిని చూడాలి,'' అన్నది.

ఒక భటుడు ఆమెను మహారాణి వద్దకు తీసుకు వెళ్ళాడు. మనోహరి మహారాణికి తనను పరిచయం చేసుకుని నమస్కరిస్తూం డగా, ''అరరే, మనోహరీ, అప్పుడే వచ్చావా? నీవంతు రాగానే నేనే నీకు కబురు పెడదా మనుకున్నాను. సరే, ఎప్పుడైతే ఏమిటి? ఆ రోకలి అందుకుని లోపలికి పద. అక్కడ నాలుగు బస్తాల ధాన్యం ఉంటుంది. అవన్నీ దంచి, బియ్యం, చిట్టు, తవుడు, నూకలు, ఊకవేరు చేసి ఇవ్వాలి. వాటిని నేను అనాథ శరణాలయానికి పంపుతాను. అందరికీ న్యాయమైన ధరలతో అందవలసిన సరుకులు అక్రమంగా దాచడానికి సాయపడ్డ నీబోటి మహిళల భరతం పట్టే బాధ్యత మహారాజు గారు నాకు అప్పగించారు. పరిస్థితి ఇప్పుడి ప్పుడే చక్కబడుతున్నది. నీకు తోడుగా ఇంకా కొందరు పనిచేస్తున్నారులే. వారం రోజులు ఇలాగే వచ్చి పని పూర్తిచేసివెళ్ళాలి,'' అంటూ భటుడి కేసి చూసింది.

నిశ్చేష్టురాలై నిలబడ్డ మనోహరికి భటుడు రోకలి అందించి కొద్ది దూరంలో వున్న ఒక విశాలమైన గదికేసి నడిపించాడు. అక్కడ సోమిదేవమ్మతో సహా మరో ముగ్గురు స్త్రీలు ధాన్యం దంచుతూ కనిపించారు.





# వింత హెచ్చరిక

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, వారణాసిలో సేనకుడనే ఒక గొప్ప సాధువు వుండేవాడు. బోధిసత్వుడి అనేక పూర్వజన్మలలో, ఈ సాధుజన్మ ఒకటి.

అదే కాలంలో నగరానికి దాపులనున్న ఒక గ్రామంలో, భిక్షాటనతో జీవించే బ్రాహ్మణు డొకడుండేవాడు. అతడొకనాడు పొరుగు గ్రామాలలో బిచ్చం ఎత్తి, ఒక అడవిగుండా ఇంటికి తిరిగి వస్తూండగా, ''ఓయీ, బ్రాహ్మ ణుడా, ఈ రోజు నువ్వు ఇంటికి వెళ్ళకపోతే, నీకు మరణం తప్పదు; ఇంటికి వెళ్ళడం జరిగితే, నీ భార్య మరణం ఖాయం!'' అన్న మాటలు వినిపించినై.

బ్రాహ్మణుడు ఉలిక్కిపడి, చుట్టూ కలయ చూశాడు. ఎవరూ కనిపించ లేదు. ఆ హెచ్చ రిక చేసినది ఏ పిశాచమో, యక్షుడో అన్న అనుమానం కలిగిందతడికి.

భయంతో నిలువెల్లా వణికిపోతూ బ్రాహ్మ ణుడు త్వరగా ఇల్లు చేరాలనుకున్నాడు. కాని, అలా చేయడం తన భార్య మరణానికి కారణం అవుతుంది. అడవిలోనే వుండిపోతే తన మరణం తప్పదు. ఇలాంటి విషమ పరి స్థితిలో ఏం చేయాలో తోచక అతడికి మతి పోయినంత పనయింది.

బ్రాహ్మణుడు ఆ సంకట స్థితిలో అడవి దాటి; నగరంలోని ఒక వీధి వెంట నడుస్తూం డగా, బోధిసత్వుడైన సేనకుడు ఒకచోట చాలామంది ప్రజలకు ధర్మబోధ చేస్తున్నాడు. ఆయన ఒక చెట్టు కింద కూర్చుని మాట్లాడు తూండగా చుట్టూ గుమిగూడిన ప్రజలు, ఆ మాటలను ఎంతో భక్తిశ్రద్ధలతో వింటున్నారు.

బ్రాహ్మణుడు అక్కడికి పోయి జనం వెన కగా నిలబడ్డాడు. ప్రాణభయంతో అల్లాడి పోతున్న అతడు బోధిసత్వుడు చెబుతున్న

జాతక కథ

దేమిటో శ్రద్ధగా వినకపోయినా, ఆయనను చూస్తూ నిశ్చలంగా వుండిపోయాడు.

కొంతసేపటికి బోధిసత్వుడు మాట్లాడడం ముగించగానే జనం హర్షధ్వానాలు చేశారు. బ్రాహ్మణుడు ఆవేదనపడుతూ, స్థాణువులా కదలామెదలక వూరుకున్నాడు.

బ్రాహ్మణుణ్ణి చూసిన బోధిసత్వుడు, అతణ్ణి తన వద్దకు రమ్మన్న సూచనగా చేయి వూపాడు.

బ్రాహ్మణుడు ఆయన వద్దకు పోయి తలవంచి నమస్కరించాడు.

బోధిసత్వుడు అతణ్ణి, ''నీకు వచ్చిన కష్ట మేమిటి?'' అని అడిగాడు.

బ్రాహ్మణుడు కళ్ళనీళ్ళు పెట్టుకుని, అడ విలో జరిగిన దానిని గురించి ఆయనకు చెప్పాడు. ''ఆ అశరీరవాణి మాటలు వినే ముందు, నువ్వేం చేస్తున్నావు?'' అని అడి గాడు బోధిసత్వుడు.

''నేనొక చెట్టుకింద కూర్చుని, సంచీ విప్పి, అందులో వున్న ఆహారం తిన్నాను,'' అన్నాడు బ్రాహ్మణుడు.

''నువ్వు, ఆహారం దాచుకున్న సంచీ కన బడుతూనేవున్నది, వెంట నీటి పాత్ర మాత్రం లేదు. మరి అడవిలో భోజనం చేశాక దాహం ఎక్కడ తీర్చుకున్నావు?'' అని అడిగాడు బోధి సత్వుడు.

''దగ్గర్లో ఒక సెలయేరున్నది. అక్కడికి పోయి దాహం తీర్చుకున్నాను,'' అన్నాడు బ్రాహ్మణుడు.



''నువ్వు పూర్తిగా తినేశావా? లేక తినగా, సంచీలో ఇంకేమైనా ఆహారం మిగిలిందా?'' అన్నాడు బోధిసత్వుడు.

''స్వామీ, సంచీలో వున్న ఆహారంలో సగమే తిన్నాను. తతిమ్మా సగం సంచీలోనే వున్నది,'' అని జవాబిచ్చాడు బ్రాహ్మణుడు.

బోధిసత్వుడు ఒక క్షణం ఆగి, ''నువ్వు నీటికోసం సెలయేటి దగ్గిరకు వెళ్ళే ముందు, సంచీమూతి, తాడుతో బిగించి కట్టావా?'' అని అడిగాడు.

''ఆ పని సెలయేటి నుంచి తిరిగి వచ్చాక చేశాను. తరవాత సంచీ తీసుకుని అక్కణ్ణించి బయలుదేరాను,'' అన్నాడు బ్రాహ్మణుడు.

''సంచీమూతి బిగించేముందు, దాని లోప లికేమైనా చూశావా?'' అన్నాడు బోధిసత్వుడు.

బ్రాహ్మణుడు అప్పుడు జరిగిందేమిటో జ్ఞాపకం తెచ్చుకునేందుకు రెండు మూడు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత, ''స్వామీ, అలా చేయలేదు,'' అన్నాడు.

బోధిసత్వుడు, ఆ సమయంలో ఏం జరిగి వుంటుందో ఊహించేందుకు ప్రయత్నిస్తూ, కొంతసేపు మౌనంగా వుండిపోయి, బ్రాహ్మణుణ్ణి, ''నువ్వు చెట్టు కిందినుంచి బయలు దేరగానే, నీకూ, నీ భార్యకూ రానున్న ప్రమాదం గురించిన హెచ్చరిక వినబడిందా?'' అని అడిగాడు.

''అవును, స్వామీ! నేను కనీసం పదీ, పన్నెండడుగులైనా నడిచి వుండను. ఎవరో స్పష్టమైన కంఠస్వరంతో, ఆ వింతహెచ్చరిక చేశారు,'' అన్నాడు బ్రాహ్మణుడు.

''అంటే, నువ్వు చెట్టు దగ్గిరనుంచి బయలు దేరేముందు ఏదో జరిగివుండాలి. బహుశా, ఏపామో, సంచీలో వున్న ఆహారం కోసం అందులో ప్రవేశించివుంటుంది. అది గమనించిన, ఏ యక్షుడో లేక వృక్షదేవతో నిన్ను హెచ్చరించింది. నువ్వు, ఈ రోజు ఇంటికి చేరకపోతే, ఆహారం కోసం సంచీ మూతి విప్పి, అందులో చేయి పెడతావు. పాము నిన్ను తప్పక కాటువేసి, నీ మరణానికి కారణం అవుతుంది. అలాకాక, ఈ రోజే నువ్వు ఇల్లు చేరితే, నీ భార్య సంచీలో ఏమున్నదో చూసేందుకు, దానిలో చేయి పెట్టి, పాము కాటుకు మరణిస్తుంది!'' అన్నాడు బోధిసత్వుడు.

ఆయన, బ్రాహ్మణుడికి సంచీ తన పక్కన పెట్టవలసిందిగా చెప్పాడు. ఆ సమయంలో జనంలోవున్న ఒక పాములవాడు వచ్చి సంచీ మూతి విప్పాడు. లోపలినుంచి ఒక నాగు పాము బయిటికి వచ్చింది.

వెంటనే పాములవాడు నేర్పుగా దానిని వడిసి పట్టుకుని దూరంగా తీసుకుపోయాడు.

అప్పుడు బోధిసత్వుడు బ్రాహ్మణుడితో, ''నువ్విప్పుడు అన్ని భయాలూ వదిలి, హాయిగా ఇంటికి పోవచ్చు,'' అన్నాడు.

బ్రాహ్మణుడు, ఆయనకు తన కృతజ్ఞత చెప్పుకుని, తేలికపడిన మనస్సుతో, ఇంటి దారి పట్టాడు.





# రామాయణం

ఖర దూషణులూ, త్రిశిరుడూ మొదలైన రాక్షసవీరులు తమ పధ్నాలుగువేల రాక్షస బలగంతో రాముడి ప్రతాపాగ్నిలో మాడి మసి అయిపోగా అకంపనుడనే రావణుడి చారుడు ప్రాణాలతో తప్పించుకుపోయి రావణుడి దర్శనం చేసుకున్నాడు.

''రావణరాజేశ్వరా, జనస్థానంలో ఉండే మన రాక్షసులందరూ యుద్ధంలో వధ అయ్యారు. నేను మాత్రం ఎలాగో ప్రాణాలతో బయటపడి ఈ వార్త చెప్పటానికి వచ్చాను,'' అని అకంపనుడు అంటూండగానే రావణుడు కళ్ళెర్రజేసి అగ్నిహోత్రుడులా అయిపోయి, ''ఎవడికి కాలం మూడింది? నేను తలుచుకుంటే అగ్నినే దగ్ధం చేస్తాను, మృత్యువునే చంపగలను. సూర్యచంద్రులు కూడా నేను ఆగ్రహిస్తే భస్మమైపోతారు,'' అని రంకెలు పెట్టాడు.

ఈ అట్టహాసం గమనించి అకంపనుడు ముందుగా రావణుడి వద్ద అభయం పొంది, రాముడు జనస్థానంలోని రాక్షసులందరినీ ఎలా చంపిందీ వివరించి చెప్పాడు.

రావణుడంతా విని బుసకొడుతూ, ''ఆ రాముడికి దేవతలందరూ సహాయం వచ్చారు కాబోలు?'' అన్నాడు.

''లేదు, లేదు. రాముడు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోడు. అగ్నికి వాయువు తోడైనట్టు రాముడికి తోడుగా అతని తమ్ముడు లక్ష్మణుడొకడున్నాడు. జనస్థానంలో ఉండే రాక్షసులను చంపినవాడు రాముడొక్కడే!'' అన్నాడు అకంపనుడు.

అరణ్యకాండ – 4



''అలా అయితే నేను జనస్థానానికి వెళ్ళి ఆ రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ చంపేస్తాను,'' అన్నాడు రావణుడు.

అకంపనుడు లబలబలాడుతూ, ''ఆ రాముడి బలపరాక్రమాలు నేను సరిగా చెప్ప లేకపోయాను. అతడికి చెలియలికట్టను భేదించి ప్రపంచమంతా సముద్రంలో ముంచే శక్తి ఉన్నది. ఆకాశాన్ని నక్షత్రాలతో సహా నాశనం చెయ్యగలడు. మూడు లోకాలూ నిర్మూలించి, కొత్తసృష్టి ప్రారంభించగలడు. రాముడు నీ చేతిలో ఎన్నటికీ చావడు. అతడు చావటానికి ఒక్కటే ఉపాయం: అతడి భార్య సీత అప్సరసలను మించిన సౌందర్యవతి. ఆమె అంటే ఆ రాముడికి ప్రాణంతో సమానం. ఆమెను ఎత్తుకువస్తే ఆ రాముడు కుమిలి కుమిలి చస్తాడు!'' అని సలహా ఇచ్చాడు.

రావణుడు కొంచెం ఆలోచించి తల పంకించి, ''మంచిది, రేపు ఉదయమే వెళ్ళి ఆ సీతను తీసుకువచ్చేస్తాను,'' అన్నాడు.

మర్నాడు ఉదయానే అతను ప్రకాశవంత మైన రథానికి గాడిదలను పూన్చిదానిలో ఎక్కి మారీచుడి ఆశ్రమానికి వెళ్ళాడు. తాటక కొడుకైన మారీచుడు రాక్షసరాజుకు చక్కగా భోజనం పెట్టి, ''ఇలా తలవని తలంపుగా వచ్చారు, రాక్షసులందరూ క్షేమమే గదా?'' అని అడిగాడు.

ఆ మాటకు రావణుడు, ''మారీచా, జన స్థానంలో ఉన్న నా బంధువులందరినీ రాముడు వధించాడు. అతడి భార్యను ఎత్తుకుపోదామని వచ్చాను. నీ సహాయం కావాలి,'' అన్నాడు.

''అయ్యో, హితం కోరినవాడిలాగా వచ్చి నీకు సీత మాట చెప్పిన దుర్మార్గుడెవరు? నీ నాశనం కోరే, వాడు నిన్ను సీతాపహరణానికి ప్రేరేపించి ఉంటాడు. ఈ పిచ్చి ఆలోచన కట్టి పెట్టి, లంకకు వెళ్ళి నీ భార్యలతో సుఖంగా ఉండు; ఈ దండకారణ్యంలో ఆ రాముణ్ణి తన భార్యతో సుఖంగా ఉండనీ. ఆ రాముడి జోలికి పోవటం నిద్రించే సింహాన్ని లేవగొట్ట టమే!'' అన్నాడు మారీచుడు.

మారీచుడింతగా చెప్పిన తరవాత రావ ణుడు తన యత్నం మానుకుని లంకకు వెళ్ళి పోయాడు. ఇంతలో శూర్పణఖ కూడా లంకకు వెళ్ళింది. నిండు కొలువులో ఉన్న రావణుడి వద్దకు వెళ్ళి, పరుషంగా మాట్లాడుతూ, ''భోగలాలసుడవై మదించి నీకు వచ్చిపడే ఘోరాన్ని కూడా తెలుసుకోకుండా ఉన్నావు!

నీ కన్న పసిపిల్లలు నయం! జనస్థానంలో రాముడు ఋషుల కోరికపై నీ వాళ్ళనందరినీ చంపి, దండకారణ్యంలో రాక్షసపురుగు లేకుండా చేస్తే నీకా సంగతి చెప్పటానికి చారులు కూడా లేరు; నీవింకేం రాజ్యం చేస్తావు? ఈ రాజ్యం ఉండదు; నీవు త్వరలోనే నశిస్తావు!'' అన్నది.

రావణుడీ మాటలు సహించలేక రోషంతో, ''ఎవడీ రాముడు? ఎక్కడి నుంచి వచ్చాడు? ఎలా ఉంటాడు? ఏపాటి పరాక్రమం గల వాడు?'' అని శూర్పణఖను అడిగాడు.

''రాముడు దశరథుడి కొడుకు. ఆజాను బాహువు. నవమన్మథుడు. అతడు యుద్ధం చెయ్యటం నేను కళ్ళారా చూశాను. వర్షం లాగా బాణాలు వచ్చిపడటం నాకు కనిపించిందేగాని, అతను బాణాలు తీయటమూ, ఎక్కు పెట్టటమూ, విడవటమూ నాకు కనిపించలేదు. ఒక్కడే క్షణంలో పధ్నాలుగు వేలమంది రాక్షసులను చంపేశాడు. ఆడదాన్ని గదా అని నన్ను చంపక అవమానించి పంపాడు. రాముడి తమ్ముడు లక్ష్మణుడు ముక్కోపి. మహాబలశాలి. అన్నకు కుడి భుజం. ఇక రాముడి భార్య సీత! ఇంతంత కళ్ళు! నిండు చంద్రుడులాటి ముఖం! బంగారువంటి శరీరచ్ఛాయ! సన్నటినడుము! ఆ సీతను ఎలాగైనా ఇక్కడికి తీసుకువచ్చి నీకు భార్యను చేతామని ప్రయత్నించేసరికి లక్ష్మణుడు నన్నిలా ముక్కు చెవులు కోశాడు. సీతను ఒక్కసారి చూస్తే నీవు మరవలేవు. ఆ రాముణ్ణి చంపేసి నీవాళ్ళ కోసం పగతీర్చుకో,



సీతను తెచ్చుకుని భార్యగా ఏలుకో. వెంటనే బయలుదేరు!'' అని శూర్పణఖ రావణుణ్ణి రెచ్చగొట్టింది.

రావణుడు సభ చాలించి ఒంటరిగా కూచుని సీతాపహరణం గురించి వివరంగా ఆలోచించాడు. సీతను పరాక్రమంతో తీసుకురావటం కన్న దొంగతనంగా తీసుకురావటమే మేలని అతనికి అనిపించింది. ఎందుకంటే అంతమంది రాక్షసులనూ, రాక్షసవీరులనూ చంపినవాణ్ణి ఓడించి సీతను ఎత్తుకురావటం మాటలు కాదు. అయితే, రావణుడు తన ఆలోచనను మండోదరికి గాని మంత్రులకు గాని చెప్పలేదు; వారు నివారిస్తారని భయపడ్డాడు.

రథం సిద్ధం చెయ్యమని రావణుడు తన సారథితో చెప్పి, అందులో ఎక్కి, కామగ



మనం చేత సముద్రాన్నిదాటి మారీచుడి ఆశ్రమానికి వచ్చిచేరాడు. మారీచుడు అతనికి అతిథి సత్కారాలు చేసి, ''ఇంతలోనే మళ్ళీ రావటానికేమి కారణం? లంకలో అందరూ క్షేమమా?'' అని అడిగాడు.

''రాముణ్ణి క్షమించటానికి వీల్లేదు. వాడు దుష్టుడు, క్రూరుడు, మూర్ఖుడు, లుబ్ధుడు. మన రాక్షసులనందరినీ నాశనం చెయ్యటమే గాక నా చెల్లెలు శూర్పణఖ ముక్కు చెవులు కోయించాడు. సీతను అపహరించదలిచాను. నాకు నీ సహాయం కావాలి. నీవు పరాక్రమం గలవాడవు, యుక్తిపరుడవు. నీకు మాయలు తెలుసు. నీవల్ల కావలిసిన సహాయం చెబు తాను విను. నీవు వెండిచుక్కలు గల బంగారు లేడి రూపం ధరించి రామాశ్రమంలో సీతకు కనపడేలాగా తిరుగు. నిన్ను పట్టితెమ్మని సీత రామలక్ష్మణులను తప్పక పంపుతుంది. ఆ సమయంలో నేను సీతను ఎత్తుకుపోతాను. సీత పోయినాక రాముడు విచారంతో కృశించి పోతాడు. ఆ స్థితిలో అతను యుద్ధానికి వచ్చినా సునాయాసంగా ఓడించేస్తాను,'' అని రావణుడు చెప్పాడు.

ఈ మాటలు విని మారీచుడికి భయంతో నోరెండిపోయింది. అతను చేతులు జోడించి, ''రాక్షసరాజా, ఈ లోకంలో ఇష్టమైన మాటలు చెప్పేవారు కొల్లలు. నచ్చకపోయినా హితమైన మాట చెప్పేవారుండరు, ఒకవేళ చెప్పేవారున్నా వినేవారుండరు. రాముణ్ణి గురించి నీవనుకునేదంతా అబద్ధం. అతను దుష్టుడూ, మూర్ఖుడూ, లుబ్ధుడూ, క్రూరుడూ ఎంత మాత్రమూ కాడు. అతను ఎవరి జోలికీ వెళ్ళలేదు. శూర్పణఖ సీతను తరిమితే పరాభవించి పంపాడు. ఖరదూషణులు తన పైకి వచ్చిపడితే వారిని చంపాడు; తప్పా? ఈ రాముడు మీసకట్టు కూడా రానివయసులో, వెయ్యి ఏనుగుల బలంగల నన్ను వెయ్యి యోజనాలు వెళ్ళి సముద్రంలో పడేలా కొట్టాడు. అంతటితో బుద్ధిరాక నేను మరి ఇద్దరు రాక్షసులతోబాటు జింకరూపు దాల్చి, మునిలాగా ఉన్నాడు కదా, ఏం చెయ్యగలడు లెమ్మని అతని ఆశ్రమం మీద పడి అతన్ని చంపబోయాను. రాముడు మూడు బాణాలు ఎక్కు పెట్టాడు. వాటిని చూడగానే నేను తప్పుకుని పారిపోయాను; కాని నా వెంట జింకల రూపంలో ఉన్న రాక్షసులిద్దరూ చచ్చారు. నాకు బుద్ధి వచ్చింది. నాకిప్పుడు

రాముడంటే సింహస్వప్నం. ఎక్కడ చూసినా నాకు రాముడే కనిపిస్తాడు. రకారంతో ప్రారంభమయ్యే మాటలు వింటేనే గుండె లవిసి పోతాయి. నేను తపస్సు చేసుకుంటున్నాను. నీకు కాలంమూడి రాముడితో తలపడాలని ఉంటే తలపడు. నన్ను ఇందులోకి ఈడవకు. నీ మేలు కోరి నేను చెప్పేది వినకపోతివో నీకు సర్వ నాశనం తప్పదు,'' అన్నాడు.

రావణుడికీ మాటలు తల కెక్కలేదు. అతను మారీచుడితో, ''దేవతలంతా వచ్చి చెప్పినా నా నిశ్చయం మారదు. నా నిర్ణయం మంచిదా, చెడ్డదా అని నేను నిన్నడిగానా? అడగని మాటలెందుకు చెబుతావు? నేను నిన్నొకటి చెయ్యమని అడిగినప్పుడు నీవు చెయ్యవలిసిందే గాని బదులాడరాదు. నేను చెప్పినట్టు బంగారు లేడి రూపం ధరించి సీతను ఆకర్షించి, ఆ తరవాత నీదారిన నువ్వు వెళ్ళిపో. నిన్ను పట్టటానికి రాముడు ఒక్కడే వస్తే అతని కంఠధ్వనితో, ''అయ్యో! సీతా! లక్ష్మణా!'' అని అరు. అప్పుడు లక్ష్మణుడు కూడా కదులుతాడు. సీత నాకు దక్కుతుంది. ఈ ఉపకారం చేస్తివా నీకు నా అర్ధరాజ్యమిస్తాను. నిరాకరించావో, ఇప్పుడే నీ ప్రాణాలు తీస్తాను. రాముడు నిన్ను చంపటం అబద్ధమూ, నేను చంపటం నిజమూ అవుతుంది,'' అన్నాడు.

మారీచుడికి మండిపోయింది. ''నన్ను చంపుతానంటున్నావు గాని, నీకీ ఆలోచన చెప్పిన దుర్మార్గుల నెందుకు చంపవు? ఇటువంటి మతిలేని ఆలోచన చేస్తూంటే నీ



మంత్రులు నిన్నెందుకు నివారించలేదు? దైవికంగా ఇది వచ్చిపడటంచేత నేను చస్తే అంత ప్రమాదంలేదు. కాని నా తరువాత నువ్వూ, రాక్షసవంశమూ, లంకానగరమూ కూడా నాశనంకాక తప్పదే, అది ఎంత ఘోరం!'' అని మారీచుడు రావణుడితో అని, పోదాం పదమన్నాడు.

అనరాని మాటలన్నీ అన్నప్పటికీ చివరకు తన మాట పాటించాడన్న ఆనందంతో రావణుడు మారీచుణ్ణి ఆలింగనం చేసుకుని, విమానంలాటి తన రథంలో అతన్ని ఎక్కించుకుని, అరటిచెట్ల మధ్యనున్న రామాశ్రమం దగ్గిర అతన్ని దించాడు.

వెంటనే మారీచుడు ఒక ఆకర్షవంతమైన, అపూర్వమైన లేడిరూపం ధరించి, గరికమేస్తూ మెల్లిగా రామాశ్రమం ప్రవేశించి అక్కడే తారట్లాడాడు. ఈ మాయాలేడి శరీరం బంగారు రంగులోనూ, దాని మీది చుక్కలు వెండి రంగులోనూ, పొట్ట తెల్లగానూ, గిట్టలు నిగనిగలాడే నలుపు రంగులోనూ, తోక పంచవర్ణాలలోనూ, కొమ్ముల చివరలు నీలం రంగుగానూ, నోరు కెంపురంగుగానూ ఎంతో అందంగా ఉన్నాయి. అది కాస్సేపు మేస్తూ, మధ్య మధ్య పచ్చికపై పడుకుంటూ, ఆ ప్రాంతంలోనే చాలాసేపు తిరిగింది.

చివరకు సీత పూలు కోయటానికి చెట్ల మధ్యకు వచ్చి ఆ లేడిని చూడనే చూసింది. చూసి పరమాశ్చర్యం చెంది, ఆమె రామలక్ష్మణులను కేకపెట్టింది. ఆమెను సమీపిస్తూ వారుకూడా మాయలేడిని చూశారు. చూస్తూనే లక్ష్మణుడు రాముడితో, ''ఈ లేడి చూస్తే మారీచుడి లాగుంది. వాడు మాయారూపంలో, వేటకువచ్చిన రాజులను తిన్నాడు. ఎందరో మునులను తిన్నాడు. ఇలాటి లేడి ఎక్కడా ఉండదు,'' అన్నాడు.

సీత లక్ష్మణుణ్ణి ఊరుకోమని, రాముడితో, ''ఆ లేడి నాకు కావాలి. తీసుకురా. చక్కగా ఆడుకుందాం. దాని అందం ఏమందం! దాన్ని ప్రాణాలతోతేస్తే, మనతో బాటు అయోధ్యకు తీసుకుపోదాం; భరతుడూ, అత్తలూ చూసి ఎంతో మురిసిపోతారు. ఒకవేళ అది ప్రాణంతో చిక్కకపోతే చంపి అయినా తీసుకురావాలి. దాని చర్మాన్ని నేను ఉంచుకుంటాను,'' అన్నది.





# అనుకున్నదొకటి!

అనంతయ్య చాలా సేపు తలుపు బాదాక, అతడి భార్య అరుంధతి ఆవులిస్తూ వచ్చి తలుపు తెరిచి, అరుగు మీద నుంచి ఆకాశం కేసి తొంగి చూస్తూ, ''ఇంత అర్ధరాత్రి వచ్చావేమిటి?'' అన్నది.

ఆ ఉదయమే అనంతయ్య పని మీద పొరుగూరు వెళుతూ, మర్నాటిగ్గాని రానని భార్యకు చెప్పాడు.

''పని త్వరగా తెమిలిపోయింది. సాయంత్రమే బాడుగబండిలో బయలుదేరాను. సగం దారిలో బండి బురదలో దిగబడిపోయింది, అక్కడి నుంచి నడిచి వచ్చేసరికి, ఈ వేళయింది!'' అంటూ అనంతయ్య విసుగ్గా లోపలికి వచ్చాడు.

అతను కాళ్ళు కడుక్కుంటూంటే అరుంధతి, ''సాయంత్రం కనకయ్య పెళ్ళాం మన ఇంటి ముందు పెద్ద రచ్చచేసింది! మన పిల్లి వాళ్ళింట్లో పాలు తాగేసిందట. నువ్వు వచ్చాక, కనకయ్యను పంపించి, నీ బుర్ర బద్దలు కొట్టిస్తుందిట,'' అన్నది.

అనంతయ్య ఇంటి వెనక వైపు కనకయ్య కుటుంబం వుంటున్నది. ఈ కుటుంబాల మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమంటుంది.

''కనకయ్య కోతలకేం గానీ, ముందు నాకు వడ్డనచెయ్యి,'' అన్నాడు అనంతయ్య.

అరుంధతి నాలుక కరుచుకున్నది. వండిన వంట ఆమె మెతుకు మిగలకుండా తినేసింది. ఆమె ఈ సంగతి భర్తకు చెప్పి, ''నువ్వు రాత్రికి తిరిగివస్తావని అనుకోలేదు. ఇప్పుడేం చెయ్యడం!'' అన్నది.

ఆ మాటలు విని అనంతయ్య అగ్గి మీద గుగ్గిలం అయిపోయాడు. చాలా దూరం నడిచి రావడంతో, అతడికి ఆకలి కరకరమంటున్నది. ''సోలెడు బియ్యం చప్పునవార్చి తగ

25-ఏళ్ళనాటి చందమామ కథ



లేస్తేపోలా! ఏ ఊరగాయతోనో తినేస్తాను,'' అన్నాడు అనంతయ్య చిరాకుపడుతూ.

అరుంధతి తటపటాయిస్తూనే, ''చిన్న జాడీలోకి తీసిన ఊరగాయ అయిపోయింది. పెద్ద ఊరగాయజాడీ అటక మీద వున్నది. దించాలంటే ఈ చీకట్లో తేళ్ళూ, జెర్రులూ, పెరట్లో తోటకూర వుంది, కోసుకురా. ఈ లోపల నేను అన్నం వండుతాను,'' అన్నది.

అనంతయ్య విసుక్కుంటూ పెరట్లోని తోటకూర మడి దగ్గిరకు వెళ్ళాడు. అంతా చీకటి. మడిలో అతని కాలి కింద ఏదో మెత్తగా నలిగింది. అనంతయ్య ఉలిక్కి పడి, పరీక్షగా చూస్తే అది పిల్లిపిల్ల!

నాలుగు రోజులక్రితమే అనంతయ్య వాళ్ళ పిల్లి నాలుగు కూనల్ని పెట్టింది. అందులో తెల్లపిల్ల అతడి కాలికింద పడిందన్న మాట. అనంతయ్య దాన్ని కదిపిచూసి, చచ్చిపోయి నట్టు తెలుసుకున్నాడు.

అతడికి ప్రాణం కడబట్టినంత పనైంది. పిల్లిని చంపినపాపం పట్టి పీడిస్తుంది! పాప పరిహారం కోసం చేయవలసిన తంతుతో ఇల్లు గుల్లయిపోతుంది. అరుంధతికి ఇలాంటి వాటిల్లో పట్టింపులు జాస్తి. గుట్టు చప్పుడు కాకుండా మడిలోనే దాన్ని పాతిపెట్టి, చెంపలు వేసుకుంటే, కొంతవరకు పాపపరిహారం అయిపోతుందనుకున్నాడు, అనంతయ్య.

అరుంధతి వంటగదిలో వున్నది. అనం తయ్య చప్పుడు కాకుండా తోటకూర మడిలో గునపంతో గొయ్యి తవ్వి, పిల్లి కూనను పాతి పెట్టి, తోటకూర కోసుకుని ఇంట్లోకి వెళ్ళి పోయాడు.

''తోటకూర కోయడానికి నీకు ఇంత సేపు పట్టింది; నేను మాత్రం వంట చిటికెలో చేసె య్యాలి!'' అని భర్తను సాధిస్తూ, తోటకూర పులుసుకాచింది అరుంధతి.

అయితే, ఆ రాత్రివేళ పెరట్లో ఏదో శబ్ద మైతే చూడవచ్చిన కనకయ్య భార్య, చీకట్లో అనంతయ్య తోటకూర మడిలో తవ్వుతూం డడం చూసి ఆశ్చర్యపోయి, ఈ వార్త చెప్పేం దుకు గదిలోకి వెళ్ళి భర్తను తట్టి లేపింది.

''అర్ధరాత్రి ఏం కొంప మునిగిందని నిద్రలేపావు?'' అంటూ కనకయ్య కళ్ళు తెరిచి, ఒళ్ళు విరుచుకోసాగాడు.

''లే, లే మన కొంప నిండబోతున్నది. అనంతయ్య తోటకూరమడితవ్వి బంగారమో, డబ్బో దాచిపెట్టాడు. వాళ్ళు పడుకోగానే

నువ్వు గుట్టుచప్పుడు కాకుండా గోడ దూకి పోయి, ఆ డబ్బు పట్టుకురా. ఈ విధంగా అయినా వాళ్ళకు మంచి శాస్తిచేయాలి,'' అన్నది కనకయ్య భార్య.

డబ్బుమాట వింటూనే కనకయ్యకు పూర్తిగా నిద్రమత్తు వదిలిపోయింది. అనంతయ్య దాచింది తవ్వి తెచ్చుకోవడానికి అతను చిన్న పెట్టె తీసుకుని బయలుదేరాడు. గోడ దూకి అనంతయ్య తోటకూర మడిలో తవ్విన గుర్తు తెలుసుకుని గునపంతో ఆ స్థలాన్ని తిరగదోడబోతున్న కనకయ్య కంఠానికి చల్లగా ఏదో తగిలింది. అతను ఉలిక్కి పడి తల ఎత్తి చూసేసరికి, పక్కనే నల్లటి దుస్తుల్లో భయంకరంగా వున్న దొంగ కనిపించాడు.

''కష్టపడి గొయ్యితవ్వి డబ్బు దాచడానికి అవస్థపడుతున్నావెందుకు? ఆ పెట్టె నాకిచ్చి, శుభ్రంగా చేతులు కడిగేసుకో!'' అన్నాడు దొంగ కరుకుగా.

దొంగను చూసి కనకయ్యకు కాళ్ళూ, చేతులూ ఆడకపోయినా బుర్ర మాత్రం చురుగ్గానే పని చేస్తున్నది. దొంగ, ఈ ఇల్లు తనదనీ, తాను డబ్బు పాతిపెట్టబోతున్నాననీ అనుకుంటున్నాడు. ఈ అవకాశం ఉపయోగించుకుని దొంగ చేత అనంతయ్య ఇల్లు దోయించాలనుకున్నాడు, కనకయ్య.

అతను మూత తెరిచి, ఖాళీపెట్టెను దొంగకు చూపుతూ, ''నా భార్య, ఈ పెట్టె పట్టేంత గుంట తవ్వమన్నది. తన నగలన్నీ తెచ్చి ఇందులో వేస్తుందట! పోయి తలుపు తట్టి, ఆమెను పిలిచి, గొడవ చెయ్యకుండా



ఆ నగలేవో పట్టుకుపో, నన్ను మాత్రం ఏమీ చెయ్యకు,'' అన్నాడు.

''నా గొంతు వింటే తలుపు తెరుస్తుందా? నీ పెళ్ళాన్ని నువ్వే పిలువు. ఆవిడ బయటికి వచ్చాక, ఆ నగల సంగతేమిటో నేనే చూసుకుంటాను,'' అంటూ దొంగ కనకయ్య మెడ పట్టుకుని, అతణ్ణి అనంతయ్య పెరటి గుమ్మం దగ్గిరకు లాక్కుపోయాడు.

ఇప్పుడు కనకయ్యకు దొంగభయం పోయింది. పెద్దగా గొంతెత్తి, ''అరుంధతీ, త్వరగా రా!'' అంటూ కేక పెట్టాడు.

తలుపు తెరవగానే అతడు భార్యకు ఏమైనా సైగలు చేస్తాడేమో అని అనుమానించి దొంగ, కనకయ్యను పెడగాతోసి, తాను తలుపు దగ్గిరగా నిలబడ్డాడు. కనకయ్య మరొకసారి, అరుంధతీ అంటూ గట్టిగా కేకవేశాడు.





ఆ కేకకు అరుంధతికి మెలకువ రాలేదు గాని, అనంతయ్య నిద్రలేచాడు. అర్ధరాత్రి ఎవరో కేక వెయ్యడం విని, అతడికి పట్టరాని కోపం వచ్చింది. హఠాత్తుగా అతడికి కనకయ్య భార్య తన భర్తచేత బుర్ర బద్దలు కొట్టిస్తానన్న మాట కూడా గుర్తుకు వచ్చింది.

అనంతయ్య పళ్ళు కొరుకుతూ దుడ్డుకర్ర తీసుకుని చప్పుడుకాకుండా పెరటి తలుపు తెరిచి, ఏం జరగబోతున్నదో దొంగ ఊహించే లోపలే, అతణ్ణి కనకయ్య అనుకుని దుడ్డు కర్రతో తలమీద బలంగా కొట్టాడు.

దొంగ కుయ్యిమని కూడా అనకుండా కుప్పకూలిపోయాడు.

కనకయ్య ఆ దెబ్బ తన నెత్తిన పడినంతగా అదిరిపడ్డాడు. కోపం వస్తే అనంతయ్య ఎంతటి సాహసానికైనా వెనుదీయడని అతడికి తెలిసిపోయింది. అలాంటి వాడితో గిల్లికజ్జాల కన్నా, స్నేహంగా వుండడం తనకు క్షేమం.

కనకయ్య ఇలా ఆలోచించి, లేని సంతోషాన్ని కనబరుస్తూ, ''భేష్, అనంతయ్యా! గజదొంగ అంతటివాణ్ణి, ఒక్క దెబ్బతో మట్టి కరిపించావు. నీకు గ్రామాధికారి నుంచి పెద్ద బహుమానం రాకమానదు,'' అన్నాడు.

అనంతయ్య ఈసారి దుడ్డుకర్రను కనకయ్య కేసి గురిచేసి, ''ఈ వెకిలి కబుర్లు అలా వుంచు. ముందు నే నడిగే దానికి జవాబు చెప్పు. నువ్వనే ఈ గజదొంగ వెంట, నా పెరట్లోకి ఎందుకు వచ్చావు?'' అని అడిగాడు.

కనకయ్య వణికిపోతూ, జరిగిన దంతా అనంతయ్యకు చెప్పి, ''ఇలా ఎందుకు చేశావని అడక్కు; దీన్నే బుద్ధిగడ్డితినడం అంటారు! నన్ను క్షమించు. ఈనాటి నుంచీ పాతరోజులు మర్చిపోదాం,'' అన్నాడు.

కనకయ్య అన్నట్టుగానే పెద్ద గజదొంగను పట్టినందుకు అనంతయ్యకు గ్రామాధికారి నుంచి బహుమానం లభించింది.

ఈ జరిగిన గొడవంతా భర్త చెప్పగా విన్న అరుంధతి నవ్వి, ''ఆ పిల్లిపిల్ల ఏదో జబ్బుతో సాయంత్రమే చచ్చి పోయింది. తెల్లవారి పనిమనిషిచేత గొయ్యి తవ్వించి పాతిద్దాం అనుకున్నాను. దాని వల్లనే నీకు బహుమానం దక్కింది. శత్రువు, మిత్రుడయ్యాడు. మరి, చచ్చిన పిల్లిని ఖననం చేసిన పుణ్యం ఊట్టినే పోతుందా!'' అన్నది.



చిత్రాలు: గాంధి అయ్య

18

# అజేయుడు గరుడుడు!



చంద్రపురిలో మానసికభ్రమ నుంచి బయటపడిన అరుణను చూసి మహారాజు, వీరబాహు సంతోషించారు. ఆమె ఆదిత్యుణ్ణి గురించి అడిగింది. ఆలయ పునరుద్ధరణ పనులలో నిమగ్నుడైవున్న ఆదిత్యుడికి అరుణకు స్వస్థత సమకూరిన విషయం తెలియజేయమని వీరబాహును మహారాజు ఆదేశించాడు.

అక్కడ వజ్రపురిలో.... ప్రధానమంత్రి పుష్పరాజ్ మహారాజు దర్శనానికి వెళ్ళాడు.
















ఆయనకు సంతతి లేనికారణంగా పరిపాలనా వ్యవహారాల పట్ల అంతగా ఆసక్తి కనబరచడం లేదు. మంత్రి దేవరాజు అధికారులను నియంత్రించలేకుండా ఉన్నాడు.
అలా అయితే, సూర్యపురి నుంచి మనకు ఎలాంటి సాయమూ లభించదంటావా?


సేనాధిపతి ఆశాపరుడు. అతనికి రాజ్యసింహాసనం అధిష్ఠించాలనే కోరిక ఉన్నది. అతడు మనకు మొదట సాయపడితే, ఆ తరవాత అతడి కోరికను నెరవేర్చుకోవడానికి మనం అతనికి సాయ పడవచ్చు.


తమరు అనుమతిస్తే, నేను వెళ్ళి అతనితో మాట్లాడి వస్తాను. అతన్ని చూసి చాలా కాలమయింది.
వద్దు పుష్పరాజ్. నువ్వు అతన్ని వజ్రపురికి ఆహ్వానించు.


మనం ఇక్కడే అతనితో రహస్య మంతనాలు జరుపుదాం.
అదీ మంచి ఆలోచనే మహారాజా! నేను ఇప్పుడే అతని వద్దకు సందేశంతో దూతను పంపుతాను.


అక్కడ ఆలయ ప్రాంగణంలో... ఆదిత్యుడు పనిచేస్తున్న శిల్పులను పర్యవేక్షిస్తున్నాడు. అప్పుడొక భటుడు అక్కడికి వచ్చాడు.
అయ్యా, రాజగురువు విచ్చేశారు!
మన రాజగురువా? ఎక్కడున్నారు?


మరి కొందరితో కలిసి ఆలయం కేసి వస్తున్నారు.
వెళదాం, పద!


ఆదిత్యుడు రాజగురుకు ఎదురు వెళ్ళి, ఆయనకూ, ఆయన వెంట వచ్చినవారికీ స్వాగతం పలికాడు.


నమస్కారం గురువర్యా! నేనే తమ పల్లకీ వరకు వచ్చి వుండేవాణ్ణి!
ఇక్కడికి వస్తున్న శిల్పులతో, పనివాళ్ళతో కలిసి వచ్చాను.


స్వప్నంలో దర్శించినప్పటి నుంచి, ఈ ఆలయాన్ని ఎప్పుడెప్పుడు వెళ్ళి చూద్దామా అన్న కోరిక నాలో ఎక్కువవుతూనే ఉన్నది.
రండి, గురువర్యా, లోపలికి వెళ్ళి చూద్దాం.


ఆదిత్యుడూ, గురువూ ఆలయంలోపలికి ప్రవేశించారు.
చాలా ఆశ్చర్యంగా వుంది... భూకంపంవల్ల ఆలయం అంతగా నాశనం కాలేదు. అది నిజంగానే అద్భుతం. అది దైవశక్తిని చాటుతున్నది.
ప్రధాన విష్ణు విగ్రహం చెక్కు చెదరకుండా సురక్షితంగా ఉంది. అది ఒక చోటి నుంచి మరో చోటికి చేరింది. అంతే.


రాజగురువు, ఆదిత్యుడు శిల్పులు పనిచేస్తున్న చోటికి వచ్చారు.
అదృష్టవశాత్తు గుడిలోపలి భాగాలకు అంతగా మరమ్మత్తులు అవసరం కాలేదు.


పునరుద్ధారణ పనులు త్వరలోనే పూర్తికావచ్చు.
పని పూర్తవగానే మనం లాంఛనప్రాయంగా ఆలయ కుంభాభిషేకం జరపడం గూర్చి ఆలోచించవచ్చు.


అప్పుడక్కడికి ఒక కాపలా భటుడు వచ్చాడు.
ప్రభూ! తమ దర్శనం కోసం చంద్రపురి నుంచి ఒకదూత వచ్చాడు.
అతడు మాతోపాటే వచ్చాడను కుంటాను.


గురువర్యా, సుదూర ప్రయాణం. విశ్రాంతి తీసుకోండి.
ఎక్కడ విశ్రాంతి తీసుకోమన్నావు?


రాజగురువును నేలమాళిగలోకి తీసుకువెళ్ళి, ఆయన అవసరాలను సమకూర్చు.
నేను అతనితో పాటు వెళతాను ఆదిత్యా.


నువ్వు నేలమాళిగలోకి వచ్చినప్పుడు, ఆలయ పవిత్రీకరణకు కుంభాభిషేకానికి ఏవేవి కావాలో చెబుతాను.


విగ్రహాన్ని పునః ప్రతిష్ఠించాలనుకుంటే ఆ కార్యక్రమాన్ని ఎల్లుండి జరపవచ్చు.
అది చాలా మంచి రోజు. కుంభాభిషేకం తరవాత జరపవచ్చు. మనం ఆ తరవాత రాజును కుంభాభిషేకానికి ఆహ్వానించవచ్చుకదా.


రాజగురువు వెళ్ళేంతవరకు అక్కడే నిలబడ్డ ఆదిత్యుడు, దూతను చూడడానికి వెనుతిరిగాడు.
నువ్వు పరంజిత్తువి కదా?
అవును ప్రభూ, వీరబాహు ఒక సందేశంతో నన్ను పంపారు.


యువరాణి అరుణ పూర్తిగా కోలుకున్నట్టు తమకు తెలియజేయమన్నారు.
ఇంకేమైనా ఉన్నదా పరంజిత్?


ఉన్నది ప్రభూ! వజ్రపురి మన మీదికి దండెత్తడానికి ఆయత్తమవుతున్నదని తెలిసింది. వీరబాహు మన సరిహద్దులను మూయించారు.
ఇక్కడి వారిని సంప్రదించాక తిరిగి వెళ్ళే విషయం నిర్ణయిస్తాను.
-(ఇంకావుంది)

మన వారసత్వ భవనాలు - 1

# ఆగ్రా కోట



**1983** యునెస్కో ఆధ్వర్యంలోని 'ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఆన్ మాన్యుమెంట్స్ అండ్ సైట్స్' 1983వ సం. జరిగిన ఏడవ సమావేశంలో ఆగ్రాలోని ఎర్రకోటను ప్రపంచ వారసత్వ ప్రదేశాలలో ఒకటిగా ప్రకటించింది. అది మనదేశంలోని కోటలలో చాలా ముఖ్యమైనది. మొగల్ చక్రవర్తులు బాబర్, హుమయూన్, అక్బర్, జహాంగీర్, షాజహాన్ ఆ కోటలోనే ఉంటూ దేశాన్ని పరిపాలించారు. అది మొదట చౌహాన్ రాజపుత్రులు నిర్మించిన ఇటుకరాళ్ళ కోటగానే ఉండేది. వాళ్ళు దానిని బాదల్‌ఘడ్ అని పిలిచేవాళ్ళు. ఢిల్లీ మొదటి సుల్తాన్ సికందర్ లోడీ (1487-1517) దానిని రెండవ రాజధానిగా చేసుకున్నాడు. ఆయన కుమారుడు ఇబ్రహీం లోడీ, 1526లో జరిగిన పానిపట్టు యుద్ధంలో బాబర్ చేతుల్లో ఓడిపోయేంతవరకు తన వశంలోనే ఉంచుకున్నాడు.

1530లో బాబర్ ఆగ్రాలో మరణించాడు. ఆ తరవాత ఆయన జ్యేష్ఠ కుమారుడు హుమాయూన్ ఇక్కడే పట్టాభిషిక్తుడయ్యాడు. షేర్షాసూరి చేతుల్లో పరాజితుడయ్యాక 18 సంవత్సరాలు ప్రవాసంలో గడిపాడు. ఆ తరవాత ఆగ్రాను, ఢిల్లీని మళ్ళీ వశపరచుకుని ప్రమాదవశాత్తు అక్కడే మరణించాడు. అక్బర్ ఢిల్లీలో పట్టాభిషిక్తుడయ్యేప్పుడు ఆయన వయసు 13 సంవత్సరాలే. 1558లో ఆయన ఆగ్రా చేరాక కోటను ఎర్రటి సున్నం రాయితో పునర్నిర్మించాలని నిర్ణయించాడు. ఆ కోట నిర్మాణం పూర్తిచేయడానికి 4000 మంది కార్మికులకు ఎనిమిదేళ్ళు పట్టాయి. అక్బర్ ఆగ్రాకు 360 కి.మీ. దూరంలో వున్న సిక్రీలో ఫతేపూర్ కోటను నిర్మించి అక్కడే కొన్నేళ్ళు గడిపి వచ్చాడు. ఆయన కుమారుడు జహంగీరు ఆగ్రా కోటలో ఉన్నప్పుడే ఇంగ్లాండు నుంచి వచ్చిన తొలి దూత సర్ థామస్‌రో ఆయన్ను చూడడానికి వచ్చాడు.

ఆగ్రా కోటను వారసత్వ భవనంగా ప్రకటించిన 'ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఆన్ మాన్యుమెంట్స్ అండ్ సైట్స్' ఈ రాచనగరును మొగల్ శిల్పకళా వైభవానికి ప్రతీకగా కొనియాడింది.

# వార్తలలో బాలలు

## ఏడురోజులలో ఒక పుస్తకం



చెన్నయ్‌లోని మద్రాస్ క్రిస్టియన్ కాలేజ్ హైయర్ సెకండరీ స్కూల్లో రెండవ తరగతి చదువుతూన్న రాజామోన్‌సింగ్ అనే ఎనిమిదేళ్ళ కుర్రాడు ఏడురోజుల్లోనే ఒక పుస్తకం రాసి ముగించాడు. అతడు రచించిన 'కిడ్స్ రెసిపి ఫర్ పిజ్జా, పైసా, పీస్' అనే ఆంగ్ల పుస్తకాన్ని చెన్నయ్‌లో లాంఛన ప్రాయంగా విడుదల చేశారు. బహుశా మోన్‌సింగ్ రాజా మన దేశం లోని ఇంగ్లీషు రచయితలందరిలోకీ చాలా చిన్నవాడై ఉంటాడు. అయితే, అతడి ఆలోచనలు మాత్రం తలపండిన తాత్వికునివిలా కనిపిస్తాయి. మచ్చుకు ఒక వాక్యం చూద్దాం: ''దేవుడంటూ ఒకడు లేడు. మనం క్రమశిక్షణ లేకుండా ప్రవర్తిస్తే, మనం చేసే పనులన్నింటినీ చూస్తూ శిక్షించడానికి ఒకడున్నాడన్న భయం మనలో కలిగించడానికి దేవుడు సృష్టించబడ్డాడు.'' తీరిక సమయాల్లో రాజామోన్‌సింగ్ అల్యూమినియం ఫాయిల్ పువ్వులూ, గ్లాస్ పెయింటింగ్స్ చేస్తాడు.

## గీతను కంఠస్థం చేసిన ఐదేళ్ళ అమ్మాయి!



**ఋ**షిప్రదకు ఐదేళ్ళే. అయితే భగవద్గీతలోని 700 శ్లోకాలను అవలీలగా అప్ప చెప్పగలదు. బీహార్ రాష్ట్రం మధుబని రైమా గ్రామంలో ఉంటూన్న ఆమె తాతగారు డా. అవధేష్ ప్రసాద్ చౌదరి, ఆమెకు సంస్కృత శ్లోకాలను నేర్చుకోవాలనే కుతూహలం ఉండడం పసికట్టాడు. ఆమెకు గీతాశ్లోకాలను ఒక్కొక్కటిగా నేర్పించాడు. ఆమె అందరినీ ఆనందాశ్చర్యాలతో ముంచెత్తేలా ఆ శ్లోకాలను కంఠస్థం చేసేసింది. ఆమె శ్లోకాలన్నిటినీ స్పష్టంగా, భాషా దోషాలు లేకుండా అప్ప చెప్పగలుగుతున్నది. అతి పిన్నప్రాయంనుంచే ఋషిప్రద తన సామర్థ్యం కనబరచేదని ఆమె తండ్రి శత్రుమర్దన్, తల్లి సవితాదేవి చెబుతున్నారు. ఋషిప్రద వల్లించే గీతా శ్లోకాలను విని పలువురు సంస్కృత పండితులు విస్తుపోయారు.

---

### చందమామ ఇండియా క్విజ్ - 4 (మే '07)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేక పోతున్నాం. చందమామ ఇండియా క్విజ్-4 సమాధానాలు 36వ పేజీలో ఇవ్వబడ్డాయి.



# విజ్ఞానం .... వినోదం .... వికాసం ....

## విజ్ఞాన వీచికలు :

### 'పిడుగు రాక్షసబల్లులు'



డైనోజార్స్ అంటే 'జురాసిక్ పార్క్' సినిమాలో చూసినట్టు పట్టుకుంటే ప్రాణాలు పోయే పొడవాటి గోళ్ళు, మాంసాన్ని చీల్చే కోరలు గల భయానకమైన రాక్షసబల్లులే ఉంటాయనుకోకండి.

జురాసిక్ కాలఘట్టంలోనే 'బ్రోంటోసారస్' అనే శాకాహారులైన రాక్షసబల్లులు కూడా ఉండేవి. బ్రోంటోసారస్ అంటే 'పిడుగురాక్షసబల్లి' అని అర్థం. అది నడిచేప్పుడు పిడుగు పడేలా ఉరిమినట్టు శబ్దం రావడం వల్ల దానికాపేరు వచ్చింది.

బ్రహ్మాండమైన ఈ జంతువులు తల నుంచి తోకవరకు 20-25 మీ. పొడవుతో 30 టన్నుల బరువు ఉంటాయి. స్తంభాల్లాంటి కాళ్ళతో పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడుస్తాయి. వాటి అడుగు జాడలు కనుగొనబడ్డాయి. అతి పెద్ద శరీరం ఉన్నప్పటికీ, అది లోతైన నీళ్ళలోకి వెళుతుంది. నీళ్ళలో దాని కాళ్ళు తేలికపడతాయి. ఆకులలములు తింటూ మెల్లగా నడిచే ఈ డైనోజార్స్ భూమి మీద తమను తినడానికి సిద్ధంగా ఉన్న తమకన్నా బలమైన 'డైయట్రోగ్నాతస్' వంటి మృగాల నుంచి తప్పించుకుని దాక్కోవడానికి కూడా లోతైన నీళ్ళు ఉపయోగపడతాయి.



## మన పరిసరాలు

### కోలా ఎలుగుబంట్లు-కొన్ని నిజాలు

చాలా అందంగా కనిపించే కోలా ఎలుగుబంట్లు పేరుకు ఎలుగుబంట్లే తప్ప, ఇవి నిజానికి ఎలుగుబంట్లు కావు. పూర్తిగా అభివృద్ధి చెందక ముందే, పిల్లల్ని పెట్టేస్తాయి. వాటిని కడుపుకింద ఉండే చిన్న సంచీలో దాచి పెంచుతాయి. పుట్టేప్పుడు ఈ పిల్లలకు కళ్ళు కనిపించవు. అయితే వాసన చూసేశక్తి, దృఢమైన ముందు కాళ్ళు, పదునైన గోళ్ళ సాయంతో తల్లి కడుపుకింది సంచీలోకి చేరి, అక్కడే ఆరు నెలలు ఉంటాయి.

కోలా ఎలుగుబంట్లు సోమరిపోతులు కావుగాని, మూడొంతుల కాలం నిద్రలోనే గడుపుతాయి. శరీరంలో బలం పోగుచేసుకోవడానికి ఇవి అలా నిద్రపోతాయి. ఇతర ఎలుగుబంట్లలాగా కోలా ఎలుగుబంట్లు తమ సరిహద్దులలో గిరిగీసుకుని కూర్చోవు. రోజూ ఆహారం కోసం ఇవి ఎక్కిన చెట్లే ఎక్కుతూ ఉంటాయి. వీటిని కోలా గృహసముదాయంగా చెబుతారు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



NARAYANAMURTHY TATA



MAHANTESH C. MORABAD



వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు సెప్టెంబర్ 2007 సంచికలో ప్రచురిస్తాం.
ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82, డిఫెన్స్‌ఆఫీసర్స్‌కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 032.

## అభినందనలు

మే నెల పోటీ ఫలితాలు
కె. రాజేష్
67-2-13/1/డి
అశోక్‌నగర్
కాకినాడ - 533 003
తూ.గో. జిల్లా (ఆం.ప్ర)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : సాగర తీరాన సాధన!
రెండవ ఫోటో : చెట్టు పక్కన నిరీక్షణ!

## సమాధానాలు :

1. విష్ణుధనుస్సు.
2. ఐఎన్ఎస్ విక్రాంత్.
3. జనరల్ కె.యం. కరియప్ప; జనరల్ ఎస్.హెచ్.ఎఫ్.జె. మానేక్‌షా.
4. వజ్రాయుధం.
5. ఎయిర్ మార్షల్ ఎస్. ముఖర్జీ.
6. పృథ్వీ.

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 032. Editor : B. Viswanatha Reddi (Viswam)




# చమురు పొదుపు చేసే మార్గాలు

రోజురోజుకూ పెరుగుతూన్న గ్లోబల్ వార్మింగ్ గురించీ; భూమి మీది జంతువులు, పక్షులు, చెట్టు చేమలు మనుషుల మీద దాని ప్రభావం గురించీ శాస్త్రవేత్తలు ప్రజలను హెచ్చరిస్తూనే ఉన్నారు. మనుషులైన మీరు ప్రకృతిని దుర్వినియోగం చేస్తూ నాశపరుస్తున్నారు గనక, మీరు కూడా ఈ గ్లోబల్ వార్మింగ్‌కు కొంతవరకు కారణం అని చెప్పవచ్చు. భూకంపాలు, తుఫానులు, వరదలు, కరువులు మొదలైన ప్రకృతి వైపరీత్యాలు; జంతువులు పక్షులు నశించి పోవడం జరుగుతున్నాయి. భూమాత ఇంకా తనలో నిలుపుకున్న వనరులను పరిరక్షించుకునే చర్యలు మీరు చేపడితే తప్ప... నేను కూడా భూమి నుంచి దూరమైపోయే కాలం అట్టేదూరంలో లేదన్న విషయం తలుచుకుంటే ఏడుపు వస్తోంది.



ఇంట్లో వంటగదిలో మీరు సరైన వంట పద్ధతులను అవలంబించాలి. స్టవ్ మీద పెట్టిన వంటకం వేడెక్కి ఆవిరిరావడం ఆరంభించగానే, మంటను అంటే ఫ్లేమ్‌ను తగ్గించాలి. వంట పూర్తయిన వెంటనే గ్యాస్‌ను, స్టవ్‌ను ఆఫ్ చెయ్యాలి...



రోడ్డు మీద 45-50 కి.మీ. వేగం దాటకుండా ఉంటే మీ కారు ఇంజిన్ చక్కగా ట్యూనై ఉంటుంది...



ఫ్యాక్టరీలలోనూ, కర్మాగారాలలోనూ చక్కని మెషీన్ మేనేజ్‌మెంట్ చేశారంటే చమురు వృథాకావడాన్ని అరికట్టవచ్చు.

నన్ను, అంటే చమురును పొదుపు చేయడానికి ఇవి కొన్ని చిట్కాలు మాత్రమే. మీరు నన్ను కాస్త ప్రేమగా, జాగ్రత్తగా చూసుకున్నారంటే నేను మీతో మరింత ఎక్కువ కాలం ఉంటాను.

చాలా కృతజ్ఞతలు, మిత్రులారా!!

CHANDAMAMA (Telugu) July 2007 RNI No. 1114/57. Regd No. TN/CC(S)Dn/159/06-08
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08